# వేడి వెలుగులు

యువభారతీయుల కవితా సంకలనం

7/3/80

ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం : 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికింద్రాబాదు-3

VEDI VELUGULU
An Anthology of Poetry
By Yuvabharathi Members



**యువభారతి**

ప్రచురణ : 66
ప్రథమ ముద్రణ :
రౌద్రి ఉగాది
17 మార్చి 1980
ప్రతులు : 1,200
ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు.
ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్.
ముఖచిత్ర ముద్రణ :
గీతా ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాద్.
ప్రతులకు :

**యువభారతి**

5 కింగ్స్‌వే, సికిందరాబాద్ - 500 003.
లేదా

**యువభారతి కార్యాలయం**

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001
వెల రూ. 3/-

---

Paper Used for the Printing of these books
was made available by
the Government of India at concessional rate.
YUVABHRATHI IS GRATEFUL

---




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినపుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదహారేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 66 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే-యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 6000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 700 మంది, భారతీ భూషణులుగా 60 మంది చేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం. భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి, మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి

హైదరాబాద్
17-3-80

# మామాట

యువభారతి సభ్యులలో కొందరికి కవితా రచనోత్సాహమున్నది. వీలు కలిగినప్పుడు తమ కవితలను ఒక సంకలనంగా వెలువరించాలనే ఉద్దేశంకూడా ఉన్నది. ఇంతవరకు 'ప్రిచికలు', 'అక్షరాలు', 'స్వరాలు' అనే కవితాసంకలనాలను ప్రచురించినాము. యువభారతి సాహిత్యోద్యమానికి తోడుపడుతున్న సాహితీ మిత్రులతో కలిసి 'ఉషస్సు' అనే కవితా సంకలనం, 'ఉదయం', 'కథావాహిని' (రెండు భాగాలు) అనే కథా సంకలనాలు ప్రచురించినాము. ఇప్పుడు ఈ 'వేడివెలుగుల'ను అందిస్తున్నాము.

తమకు కలిగిన అనుభూతులకు అక్షరాకృతి కల్పించాలనే సభ్యుల ఉత్సాహమే ఈ కవితా సంకలనానికి పునాది. యువభారతి తన సభ్యులలోని కవితా శక్తిని పరిచయం చేసి వారిని ప్రోత్సాహించాలనే ఉద్దేశంతో ఈ సంకలనాలను వెలువరిస్తున్నది. ఈ కవితా సంకలనంలో పద్నాలుగు మంది కవితలున్నవి. సమకాలిక సమాజంలోని దుర్భరమైన కొన్ని పోకడలు ఈ కవులకు కావ్య వస్తువులైనవి. ఇప్పుడున్న స్థితికంటె సమున్నత స్థితికి దేశం ఎదిగిపోవాలనే ఆకాంక్ష ఈ సంకలనంలో అంతటా పరచుకొని ఉన్నది. ఎవరెవరికో ఎన్నెన్నో ఆలోచనలుంటాయి. అవి ఏ రూపంలో ఎప్పుడు వెలికివస్తాయో ఎవరికీ తెలియదు. తనకు కల్గిన ఆలోచనలకు శబ్దరూపం కల్పించి ప్రకటించుకునే ఉత్సాహం ప్రతివానికీ ఉండాలి. అదే ప్రజాస్వామ్యానికి పునాది. ఇక ఆ ఆలోచనల అందాన్నిబట్టి శక్తినిబట్టి వాటికి ప్రాచుర్యం కలుగుతుంది. ఒకరికో లేక కొందరికో నచ్చిన భావాలనే నచ్చిన తీరులోనే ప్రకటించాలనే అభిప్రాయం అంత సరసమైనది కాదని యువభారతి అభిప్రాయం. నాతోపాటు ఈ సంకలనంలో తమ కవితలను సమకూర్చి ఈ కవితా సంకలన ప్రచురణ కార్యక్రమాన్ని జయప్రదం చేసిన సోదర సభ్యులకు 'రౌద్రి' ఉగాది శుభాకాంక్షలు.

ఈ సంకలన ప్రచురణకు బాధ్యత వహించిన మా సంస్థ కార్యదర్శి శ్రీ అయలసోమయాజుల నాగేశ్వరరావు గారికీ, సహ కార్యదర్శి శ్రీ గొర్ల కుమారస్వామి నాయుడు గారికీ అభినందనలు.

తెలుగు పఠితృలోకానికి 'రౌద్రి' ఉగాది శుభాభినందనలు. యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూత నివ్వవలసిందిగా ఈ శుభవేళ సహృదయులను సంప్రార్థిస్తున్నాము.

రౌద్రి ఉగాది, 
17 మార్చి 1980.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.
యువభారతి




# ప్రేరణ

యువకులలో ఆలోచనాశక్తిని, అనర్గళ వచోయుక్తిని, అనవరత రచనాశక్తిని పెంపొందించి, వారిని బాధ్యతాయుతమైన పౌరులుగా తీర్చిదిద్దేందుకు యువభారతి గడచిన పదహారు సంవత్సరాలుగా అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహించిన సంగతి మీరెరిగినదే.

ఇందులో భాగంగా యువభారతి సభ్యులలో పన్నాలుగు మంది రచనలను ''వేడి వెలుగులు'' అనే కవితాసంకలనంగా రౌద్రి ఉగాదికి తెలుగు పఠితృలోకానికి అందిస్తోంది. ఇది యువభారతీయుల నాల్గవ కవితా సంకలనం. ఇదివరలో ''వీచికలు'', ''అక్షరాలు'', "స్వరాలు'' అనే మూడు కవితా సంకలనాలు వెలువడ్డాయి. వీచికలుగా కదిలి, అక్షరాలను దిద్ది, స్వరాలను నేర్చుకొన్న యువభారతీయులు ఇప్పుడు ''వేడివెలుగులై'' సాహిత్యాకాశంలోకి ప్రాకుతున్నారు.

ఈ కవితా సంకలనంలో నిష్ణాతులయి, లబ్ధప్రతిష్ఠులయిన కవులతో పాటు తొలిసారి ధైర్యంగా కలంపట్టి వ్రాసిన వారు కూడా ఉన్నారు. ఇది కవితా సంకలనానికొక వన్నె తెచ్చింది. ఈ కవితా సంకలనాన్ని వెలువరించటానికి ప్రేరణను కలిగించి, రచనలనన్నింటినీ ఓపికతో పరిశీలించి, తగిన సలహాలిచ్చి, మెరుగులు దిద్దిన మా సంస్థ అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, మా ఉపాధ్యక్షులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు గారికి మా కృతజ్ఞతలు.

మేము కోరిన వెంటనే అంగీకరించి ఈ సంకలనానికి ముందుమాట వ్రాసి మమ్ములను ఆశీర్వదించిన మా ప్రధాన సంపాదకులు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారికి మా హార్దికాభివాదాలు.

ఈ పుస్తకాన్ని తమ కరకమలాలతో ఆవిష్కరించి అన్ని విధాలా మమ్ము ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి వతంసులు, కళాప్రపూర్ణ డా॥ దాశరధిగారికి మా నమస్సుమాంజలులు.

తీరుబడి తక్కువగా ఉన్నప్పటికీ, వీలుచేసికొని ముఖ చిత్రాన్ని ముచ్చటగా తీర్చిదిద్దిన ప్రముఖ కళాకారులు, శ్రీ శీలా వీర్రాజుగారికి మా కృతజ్ఞతలు.

అల్పవ్యవధిలో అచ్చు కార్యక్రమాన్ని చేపట్టి, అందంగా ముద్రించి. యిచ్చిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ముఖ్యంగా అధినేత శ్రీ శ్రీనివాస్ గారికి మా ధన్యవాదాలు.

సకాలంలో బ్లాకులను తయారుచేసి అందించిన శ్రీ అశోక్ గారికి, ముఖచిత్రాన్ని రంగుల్లో ముద్రించి యిచ్చిన గీతా ఆర్ట్ ప్రింటర్స్ అధినేతలు శ్రీ బోస్‌గారికి మా అభివాదాలు.

ఈ పుస్తకాల ముద్రణకయ్యే వెండి కాగితాన్ని తక్కువ ధరకు అందించి సహకరించిన భారత ప్రభుత్వము వారికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పాఠ్యగ్రంథ ముద్రణాలయము వారికి మా కృతజ్ఞతలు.

మేము కోరిన వెంటనే అంగీకరించి, తమ కవితలను అందించి, సకాలంలో ఈ కవితా సంకలనాన్ని వెలువరించేందుకు సహకరించిన సహ మిత్రులందరికీ మరోమారు అక్షర రూపంలో మా కృతజ్ఞతను అందజేస్తున్నాము.

మిత్రుల సహకారం, పెద్దల ఆశీస్సులూ ఉంటే ప్రతియేటా ఉగాదికి ఒక యువభారతీయుల కవితా సంకలనాన్ని వెలువరించాలని ఆశిస్తున్నాం.

ఇలా పేరు పేరున కృతజ్ఞతలు వెల్లడించడం కష్ట సాధ్యమయిన పని. అందుకే ఎందరో మహానుభావులు - అందరికీ వందనాలు.

తెలుగు పఠితృలోకం ఈ కవితా సంకలనాన్ని ఆదరించి, ఆస్వాదించి మాకు ఆశీరమృతాన్ని అందచేస్తుందని ఆశిస్తూ -

ఉగాది శుభకాంక్షలతో !

భవదీయులు
అయలసోమయాజుల నాగేశ్వరరావు
గోళ్ళ కుమారస్వామి నాయుడు
సంకలనకర్తలు.

# పరిచయాలు

## డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

''వీచికలు'', ''అక్షరాలు'' ''స్వరాలు'', కవుల్లో ఒకరు. జననం 1930. స్వస్థలం మహబూబ్ నగరము. కవి సమయాలు అను అంశముపై పరిశోధన చేసి డాక్టరేట్ పట్టాను ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి పొందినారు. హైదరాబాద్ పోస్టుగ్రాడ్యుయేట్ కాలేజిలో రీడరు.

## గోళ్ల కుమారస్వామి నాయుడు

''స్వరాలు, ''ఉషస్సు'' కవుల్లో ఒకరు. స్వస్థలం బెల్లం గోవిందుపల్లె, చిత్తూరు జిల్లా. ఉద్యోగరీత్యా హైదరాబాద్‌లో నివాసం. జననం 5-4-1944. ఉస్మానియా విశ్వ విద్యాలయం ఎమ్. ఏ (తెలుగు) పట్టభద్రులు. ఉపాధ్యాయులుగ ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో పనిచేస్తున్నారు.

''ఆలోచింప చేయగల అక్షరాలు వెలుగు చూపించగల పదాలు కవిత్వం.''

## పింగళి జగన్నాధరావు

వయస్సు 34 సంవత్సరాలు. ఎమ్. ఒ. ఎల్. చదివారు. ఉపాధ్యాయులుగ పనిచేస్తున్నారు.

## జయప్రభ

జన్మస్థలం: నాగపూర్, మహారాష్ట్ర.

జననం 29-7-1957 తెలుగు అభిమాన విషయంగా బి. ఏ. రెండవ సంవత్సరం చదువు సాగుతోంది. భర్త ఉద్యోగరీత్యా వెంపల్లిలో నివాసం. రచనావ్యాసంగం కొనసాగిస్తున్నది రెండు సంవత్సరాలనుంచే అయినా పుస్తక రూపంలో వచ్చింది యువభారతీయుల కవితా సంకలనంనుంచే. ''ప్రజా హృదయాలను కదిలించి కొంచెంసేపయినా ఆలోచింప చేయగలిగితే కవిత్వానికి సార్థకత కలిగించినట్లే''.

## అయలసోమయాజుల నాగేశ్వరరావు

జన్మస్థలం- మద్దివలస గ్రామం,శ్రీకాకుళం జిల్లా.జననం 21-9-1947. విద్యాభ్యాసం మహారాజ కళాశాల-విజయనగరం.

విద్య బియసి, సి. బి. ఇడి. ఏ. జి. ఆఫీసులో ఆడిటర్ ఉద్యోగం.

ఇదే తొలిప్రయత్నం. త్వరలో రానున్న పుస్తకం ''జంఘాల శాస్త్రి ఉపన్యాసాలు.''

## శంభన్నగారి నారాయణరెడ్డి

స్వస్థలం - తోపుగొండ గ్రామము, మెదకు జిల్లా. వయస్సు 30 సంవత్సరాలు.

విద్య - ఎమ్. ఏ. (తెలుగు) ఎమ్. ఓ. యల్. (తెలుగు) ఉస్మానియా విశ్వవిద్యాలయం. విద్వాన్ (హిందీ ప్రచారసభ, హైదరాబాద్). మార్వాడి హిందీ విద్యాలయ హైస్కూలులో ఉపాధ్యాయులుగా పని చేస్తున్నారు. చాలా కాలంగా సాహిత్యంలో అభినివేశం ఉన్నా ఇదే తొలి ప్రయత్నం.

''ప్రత్యేకించి కవి అన్నవాని కవిత్వంలోను వ్యక్తిత్వంలోను నిజాయితీ అవసరము''.

## అయ్యదేవర పురుషోత్తమరావు

అక్షరాలు, స్వరాలు కవుల్లో ఒకరు.

జనన 1933. స్వస్థలం ఎర్రుపాలెం, ఖమ్మం జిల్లా.

విద్య బి. ఏ. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఉద్యోగం.

## డా॥ నాగినేని భాస్కరరావు

జననం 1-11-1949. స్వస్థలం బనిగండ్లపాడు, ఖమ్మం జిల్లా.

విద్య - యం. బి. బి. యస్. వృత్తి మధిరలో నర్సింగ్ హోమ్.

అక్షరాలు, స్వరాలు, మేం-కవుల్లో ఒకరు.

## రెడ్డి రాఘవయ్య

జననం 1940. స్వస్థలం తెనాలి తాలూకా ప్యాపట్లు గ్రామం. విద్య సామాన్యం.వృత్తికార్మికం.అభిమానం సాహిత్యం.అందులో బాలసాహిత్యం అంటే

ప్రత్యేకాభిమానం. ఉషస్సు కవుల్లో ఒకరు. ఉదయం రచయితల్లో ఒకరు విజ్ఞానోదయం, బాల నీతిమాల పుస్తకాలు రచించారు. కేంద్రప్రభుత్వం నిర్వహించిన 18వ బాలసాహిత్యం పోటీలో ''గాలిలో ప్రయాణం'' (అముద్రితం) ఉత్తమ బహుమతిని అందుకొంది.

## "ఆ రా"

ఆసలుపేరు ఎ. రామలింగేశ్వరరావు - జననం. 21-5-1596 పశ్చిమగోదావరి జిల్లా నిడదవోలు పట్టభద్రుడు - టెలిఫోన్స్‌లో అకౌంట్సు విభాగంలో ఉద్యోగం - లా ఫైనల్ చదువుతున్నారు.

## పి. ఎస్. న్. శర్మ

పూర్తిపేరు పనుమర్తి సత్యనారాయణ శర్మ. జన్మస్థలం కూచిపూడి అగ్రహారం. జననం 5-8-1944.

రైల్వేలో ఉద్యోగం. చదువు ఎమ్. ఏ. (తెలుగు) ఎల్. ఎల్. బి.

చాలాకాలంగా సాహిత్యంలో కృషి చేస్తున్నారు.

## డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు

జననం- 1-1-1942. స్వస్థలం నారాయణపురం, సిరిసిల్ల తాలూకా, కరీంనగర్ జిల్లా. సికిందరాబాద్ సర్దారుపటేలు కాలేజిలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

తెలుగులో గేయ నాటికలు అను అంశంపై పరిశోధన చేసి డాక్టరేట్ పొందినారు. స్వరాల కవుల్లో ఒకరు.

ఉదయరాగం, జీవనస్వరాలు, కిరణాలు - కెరటాలు అనే కావ్యాలను రచించారు.

## ఎ. వి. వి. సత్యనారాయణ

(కలంపేరు వి. వి. ఎస్. ఎన్. అడబాల) స్వస్థలం తణుకు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా, తిరుపతిపురం. జననం 1-10-1954 చదువు విద్యాప్రవీణ (ఓరియంటల్ టైటిల్) ఆంధ్ర విశ్వవిద్యాలయం. ''కవిత్వం కేవలం ఒక హాబి మాత్రమేకాక అంతో యింతో సామాజిక చైతన్యం తీసుకరావాలని నా ప్రయత్నం''.

## ఎమ్. సూర్యనారాయణ

స్వస్థలం- కాపుగల్లు, నల్లగొండ జిల్లా.

జననం- 8-6-1960.

సికిందరాబాద్ ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలలో బి. కాం. రెండవ సంవత్సరం చదువుచున్నారు.

# కాంతికిరణం

కవితా సంకలనం ఒకటి తెలుగుదేశంతో వచ్చిందంటే ఒక నవ్య కవితా చైతన్యం వచ్చిందని సహృదయులు సందడి పడటం నేడు సహజమైపోయింది. అందులోనూ నాలాంటి విమర్శకుల మాట చెప్పనవసరమేలేదు. అభ్యుదయ కవుల సంకలనమా, విప్లవకవుల కవితా సంపుటియా, కవిసేన కవితాగుచ్ఛమా ఏ శాఖకు చెందింది ఈ కవితా కదంబమని ఉత్కంఠతో స్వీకరించటం పరిపాటి అయింది. ఇది యువభారతీయుల కవితా సంకలనం. పేరు 'వేడివెలుగులు'. ఈ పేరు వినేసరికి ఆసక్తితో చూచాను. ఇది పైన పేర్కొన్న ఏ శాఖలకూ సంబంధించింది కాదు. అయితే, ఈ యువభారతీయులు ఏ వర్గంవారు? వీరికి సర్గంమీద ఉన్న ఆసక్తి వర్గంమీదలేదు. కవితకు వేడీ వెలుగూ రెండూ ఉండాలనే హృదయవాదుల్లా కనపడుతున్నారు. వేడిఆవేదనకుసంబంధించింది; వెలుగు వివేకానికి సంబంధించింది. ఆవేదనతో ఆలోచించటం, హృదయంతో స్పందించటం వీరి సహజ లక్షణాలుగా కనపడుతున్నాయి. సమాజాన్ని చూడటం. స్వభావాన్ని వివేచించటం. స్వభావోక్తుల్లో పలకటం, అనుభవాలను సూక్తులుగా సంపుటీకరించటం, ఆశుకవిత్వంలా వచన కవితను ఆలపించటం వీరి కవితాలక్షణాల్లా కనపడుతున్నవి. వీరిలో విభిన్న విశ్వాసాలున్న వారున్నారు. కాని, మానవత్వం వారి ధ్యేయం. అమానుషత్వాన్నీ, అయోమయత్వాన్నీ, పరపీడన ప్రవృత్తినీ, పరనిందా ప్రసక్తినీ, పదాడంబరాన్నీ, ప్రయోగ సంక్లిష్టతనూ వీళ్లు అంగీకరించే వారులా లేరు. వీరికి అనుభవించటం కంటె ఆలోచించటం ఎక్కువలా కనపడుతుంది; ద్రవించటం కంటె స్పందించటం స్వభావంగా ఉంది. వక్రోక్తులకంటె స్వభావోక్తులే అలంకారాల్లా ఉన్నాయి. వ్యంగ్యం కంటె వాచ్యమే హృద్యంగా కనపడుతోంది. ఈ లక్షణాలన్నీ సంపుటీకరిస్తే వీరి కవిత కదిలించిందానికంటె, కరిగించిందానికంటె, సవరించటం ముఖ్యమని సాగినట్లుగా స్ఫురిస్తుంది. సవరించటం సూక్తి ముక్తా ఫలాల సంవాదం ద్వారా సాధించాలని వీరి యత్నంలా కనపడుతుంది!

యువభారతీయుల కుటుంబానికి పెద్ద డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి. 'గతంమీద నమ్మకం లేనివాడు, స్వగతం వినుమని సతాయిస్తున్నా'డని వారి ఫిర్యాదు. 'కవితాశక్తిమీద నమ్మకం లేనివాడు, కవిగా తనను లోకం పొగడాలని ఉవ్విళ్లూరుతున్నా'డని వారి 'ప్రతారణం' చెప్పదలచుకున్నది సూక్తులుగా నిబంధిస్తే ఏ ప్రక్రియలోనైనా నలుగురి నోట నిల్వవచ్చునని వీరి ఆశయం. వీరి పలుకుల్లో వేడి ఉంది; వెలుగూ ఉంది.

ఈ స్వభావం సర్వత్రా ఈ కుటుంబంలో అంతో ఇంతో కనపడుతుంది. కొందరు నిలువెల్లా ఈ వైఖరి ప్రదర్శిస్తే మరికొందరు నడిమెరుపుల్లో, కొసమెరుపుల్లో ఈ విద్యను ప్రదర్శిస్తారు. వీరు వేడిని జ్వాలగా మండించి పిండరు; దివ్వెలా వెలిగించి ప్రోవు చేస్తారు వెలుగును తన చుట్టూ ఉన్న చీకటిని తొలగించటానికి

వినిమోగిస్తారు. వీరి వేడి లోహాన్ని కరిగించేదికాదు; సంక్రాంతి చలిమంటగా సుఖాన్నిచ్చేది. వీరి వెలుగు సూర్యరశ్మిలా ప్రచండంగా తాండవించేదికాదు; విద్యుద్దీపంలా హృద్యంగా వస్తు వివేచనానికి తోడ్పడేది.

చీకటికి చిరునామా లేకుండా చేయటానికి 'రాత్రుల్లో గూడ డ్యూటీ చెయ్య మనీ'సూర్యుణ్ణి శాసిస్తాడు కుమారస్వామి 'అనాగరికులు రాళ్ళతో కొట్టుకుచస్తే, నాగరికులు రాకెట్లతో కొట్టుకుంటున్నా' రంటారు పింగళి జగన్నాధరావు. 'కొత్త పుడమిని సృష్టిచేసిన క్రాంతి దేవిని-సృష్టికర్త' నంటుంది జయప్రభ. 'వసంతం వచ్చినా, కోయిల కూయలే'దని కోపగిస్తారు నాగేశ్వరరావు. 'చీకటి రాక్షసి కబంధహస్తాల్లో సూర్యుడు హత్యచేయబడ్డా'డని కంప్లయింటు చేస్తారు నారాయణ రెడ్డి 'నీవూరే నీకు యింత మంచిగానప్పుడు పొరుగూరి పట్టాభిషేకం ఎలా కుదురుతుం'దని గద్దిస్తారు పురుషోత్తమరావు. మైనస్ × మైనస్ = మైనస్ అన్న నేటి వ్యవస్థా సూత్రాన్ని నీకూ నాకు అప్లై చేసి చూపించారు భాస్కర రావు. 'నమ్ముకున్న నాయకుణ్ణి ఓట్లతో గెలిపించి పాట్లు పడుతూనే ఉన్న దిక్కులేని బక్క వోటర్లు' చుక్కలని వెక్కిరిస్తారు శ్రీనివాసా చార్య.' 'తెల్లవారిందని అకాలంలో కూతలు పెట్టే కోళ్ళ'ను వేళ్ళతో చూపిస్తారు శర్మ. 'మరో ప్రపంచ మహాపర్వతాన్ని కోట్లాది భుజాలతో మోసుకొద్దాం' అని కేకవేస్తున్నారు అకబాల. 'బావికోసం కేటాయించిన ఆవరణలో మాత్రం లేచాయి గడ్డివాములు - ఆ వూరి భూస్వామివి'-అని ఉన్నమాట అంటున్నారు సూర్యనారాయణ. ఇవన్నీ వీరి వేడి మాటలు. ఇవ్వన్నీ ఎవరికీ దహింపచేయవు, వాతలుపెట్టవు కాని, మండే గుండెలను, నిండైన వాస్తవాలను ఖచ్చితంగా చెపుతాయి. వీరి కళ్ళు ఎర్రపడ్డాయి కాని, నిప్పులు క్రక్కవు. పిలిచి పాఠం చెపుతాయి కాని వెంటాడి తుపాకులతో పేల్చవు. మిత హిత సత్యవాక్కులు యువభారతీయులు!

పరుగెత్తి పాలు త్రాగబోయి పడిందానికంటె, నిలిచి నెమ్మదిగా నిమ్మ నీరు త్రాగాలని భావించే భావుకులీ యువభారతీయులు. వీరి కవితా సంకల నాలల్లో ఇది నాలుగోది. నాలుగు కాలాలపాటు నిలిచే ప్రయత్నం వేడిగా ముందుకు సాగి వెలుగులా వ్యాపించాలనీ, ఆ ప్రస్థానంలో ఈ యత్నం కాంతికిరణం కావాలనీ ఆశిస్తూ వీరిని అభినందిస్తున్నాను.

రౌద్రి ఉగాది — జి. వి. సుబ్రహ్మణ్యం.

**17-3-1980.**

# వేడివెలుగులు

## అనుక్రమణిక

# కానక్కరలేదు

ఇరివెంటి కృష్ణమూర్తి

కష్టాలకు నష్టాలకు వెరచి
కట్టుబాట్లకు స్వాగతం చెప్పే జీవులు
పశువులే కానక్కరలేదు.

పరహితం కోసం
ఇక్కట్ల వెల్లువల కెదురీదేవాళ్లు
దేవతలే కానక్కరలేదు.

సభ్యతా వసనాలను డుల్చి
శుభ్రతా దీపాలను ఆర్పి
పశుహేలలో ఓలలాడేవాళ్లు
మనుషులే కానక్కరలేదు.

పదాల అందాలను
అర్థాల పరిమళాలను
తెలుసుకోకుండా వ్రాసేవాళ్లు
కవులే కానక్కరలేదు.

మెదళ్లను కుదువబెట్టి
సొంతబుద్ధిని సమాధిచేసి
శాస్త్రీయ జీవనజ్యోత్స్నలకోసం
కలలు కనేవాళ్లు
మేధావులే కానక్కరలేదు.

చలువ పందిళ్లలో చదరంగాలాడుతూ
పచ్చలారని పూలమొగ్గలను
ఎండలోకి విసిరేవాళ్లు
నాయకులే కానక్కరలేదు.

ఎండమావులను జలాశయాలని నమ్మించి
పబ్బం గడుపుకునేవాళ్లు
పండితులే కానక్కరలేదు.

బ్రతుకును పండించే లక్ష్మి
ప్రాంగణంలో అడుగిడుతుంటే
ధనపిశాచంకోసం అర్రులు చాచేవాళ్లు
నాగరకులే కానక్కరలేదు.

## ప్రతారణం

గతంమీద నమ్మకం లేనివాడు
స్వగతం వినుమని సతాయిస్తున్నాడు.
చదువుమీద నమ్మకం లేనివాడు
చదువుకున్నవానిలా నటిస్తున్నాడు.

జనం మంచితనంమీద నమ్మకం లేనివాడు
తన మంచితనాన్ని గుర్తించుమంటున్నాడు.
తన నుదుట పొద్దుపొడిచిందంటున్నవాడు
కనబడలేదంటే-కళ్లులేవు పొమ్మంటున్నాడు.

కవితాశక్తిమీద నమ్మకం లేనివాడు
కవిగా తనను లోకం పొగడాలని ఉవ్విళ్లూరుతున్నాడు.

## మైథిలీ శరణ్

మహా స్రవంతికెవడు
మార్గదర్శి కాగలుగుతాడు ?

అది తనమార్గాన్ని
తానే సృజించుకుంటుంది.
అవరోధం ఎదురౌతే
పక్కకు పారుతుంది.

లేదా
విజృంభించి అధిగమిస్తుంది.
సౌందర్యమే దాని స్వభావం.

సుగభీర సువిశాల ప్రగాఢ మహాజలధి
దానికి గమ్యం.
అక్కడే దానికి తన్మయత్వం.
ఒక మహా స్రవంతి
మైథిలీశరణ్.

భారత నాగరతా లతానికుంజం
విరయబూసి, ప్రతిభాసౌరభాలను
గుబాళించిన మహోషస్సంధ్యావేళలు
ఎన్నని గుణింతుము
ఎన్నని వర్ణింతుము ?
వాల్మీకివలె, వ్యాసునివలె,
కాళిదాసువలె ఈ యుగాన
కవితాప్రతిభాజ్యోతిస్సులను
వెదజల్లినాడు
మైథిలీశరణ్.

అధునాతన భారతీయసాహితీ
విహాయసంలో
విలసిల్లిన మహాతారకల్లో
జాజ్జ్వల్యంగా మెరసిపోయి
దాస్య తమస్సులను వేటాడి
అతి శీతాలాచ్ఛకాంతులను వెదజల్లిన
మహా నక్షత్రం
మైథిలీశరణ్.

హిందీభాషా శకుంతలను
మృదులమంజులపద్మహస్తాలతో నెత్తి
పోషించి, మాటనేర్పి, ఆటనేర్పి
మహా సౌందర్యమూర్తిగా శిల్పించి
భారతావనికి పట్టమహిషిని చేసిన
భాషాతపోమూర్తి కణ్వుడు
మైథిలీశరణ్.

అతడు భక్తుడు
సంసార జంబాల పటలమగ్నుడై
దేవుని, జీవుని మరువని
పరమోదార మనస్వి.

కట్టులో, బొట్టులో, జుట్టులో
అచ్చంగా భారతీయుడతడు
తనవూరు చిర్గాంవును
ఆశ్రమంగా మార్చుకున్న తపస్వి
మైథిలీశరణ్.

అతని నవనీత హృదయంవలెనే
అతని కావ్యం మృదులాతిమృదులం
అతని కవిత్వం జనతాలతాపరివేష్టిత
మందార మహా కల్పతరువు.
జనులకై బ్రతికి, జనులకై వ్రాసినాడు.
సూటిగా నడువుటే అతనికి పరిపాటి
హిందీ కవులలో అతనికతడే సాటి.
అచ్చమైనకవి మైథిలీశరణ్.

కీర్తిలో కీడుందని
జనాన్ని చూచి పారిపోయేస్వభావం;
కనుకనే అతడు పలువురిలో ఒకడు.
అతనితో చెలిమిచేయటం
అందరికీ సాధ్యంకానిపని.
కాని చేసినవానిని
అతన్నుండి విడదీయటం
బ్రహ్మ చేయలేనిపని.
కవిత్వంలోని మెలకువలు
అతనికి చాలా తెలుసు.
వ్యాపారంలోని
కిటుకు లుకూడా తెలుసు.
కనుకనే కవిగా బ్రతికినా
ఎన్నడూ మోసపోలేదు.
మైథిలీశరణ్.

మనసులో పొటమరించిన భావాన్ని
కావ్యంగా మలచి, నిర్భయంగా
బాహిరిల్లచేయడం అతని స్వభావం.
ఇంత స్వేచ్ఛాజీవిని పర ప్రభుత్వం
సహిస్తుందా ?

కనుకనే ఎన్నోమార్లు
కృష్ణజననావాసంలో వసించి
ఇంటికి చేరుకున్న పరమతైర్థికుడు
మైథిలీశరణ్.

భారతజాతికి పితృకల్పుడైన
గాంధీమహాత్ముడు
రవీంద్రుణ్ణి 'గురుదేవ్' అనీ
అతణ్ణి 'రాష్ట్రకవి' అనీ
పిలిచేవాడట.

అతనిమార్గం అతనిదే.
అతని ధ్వని అతనిదే.
భావ విహాయస వీధుల్లో
తన రెక్కలతోనే ఎగసిన
విహంగం
మైథిలీశరణ్.

యశోధరా ఊర్మిళలు
భారతీయకావ్య కౌటుంబిక జీవితంలో
మూగనోము ధరించినవారలు.
ఆ యిరువురి గుండెల్లోకి దూరి
తన కావ్యాలను అశ్రుస్నాతాలుగా
అమృత వర్షిణులుగా
అవతరింపజేసిన
కరుణమూర్తి
మైథిలీశరణ్.

మహాకవీ! మనిషీ! మనీషీ!
నీకు భారతీయు లధమర్ణులు.
నీ స్మరణమే కవిత్వాని కామ్రేడితం.
నీ వ్యక్తిత్వమే మృదులహృదయానికి
పునరుక్తి.
రససిద్ధుడవైన ఓ కవీశ్వరా!
నీ వాణి-
రూపుగొన్నవాణి,
నీకు జయమగుగాక.

—oo✤oo—

# గుండెల్లో సూర్యుడు

గొల్ల కుమారస్వామినాయుడు

ఎంత పెద్ద దివ్వె
వెలిగించినా
వెనుకబడిన వానింటికి
వెలుగు వెళ్ళడం లేదు !
తూర్పు కొండల్లో
ఉదయించే సూర్యుడు
మార్పు తెస్తాడని
కొండంత ఆశ పెట్టుకొంటే
పొంచి ఉన్నారు పొలిమేరల్లో
రాహు కేతువులు
అందుకే నేను
రాహుకేతు పీడారహిత రవిని
గుండెల్లో సృష్టిస్తున్నాను !
రాత్రుల్లో గూడ
డ్యూటీ చెయ్యమని శాసిస్తున్నాను !
చీకటికి చిరునామా లేకుండా
చేయడానికి యత్నిస్తున్నాను ;

## భయం

సూర్యుడు ఎప్పుడూ
కిరీటాన్ని కోరడు
పదవిని ఆశించడు
పార్టీని మార్చడు

క్రమం తప్పక
దినచర్య చేసుకపోతాడు
అందుకే

చీకటికి సూర్యుడంటే
చచ్చేంత భయం

## చినిగిన విస్తరి

అది, నగరం నడి బొడ్డు
అక్కడ, నవ నాగరికత
రోడ్డుకు అడ్డదిడ్డంగా నడుస్తోంది
అడ్డంగా బలిసిన మనిషిలా !

మెర్క్యూరీ దీపాలు మేలుకొనే ఉన్నాయి !
చీకటి తెరమీద జరిగే
చిత్రాలను చూసే ప్రేక్షకుల్లా !
ఆకాశంలో నక్షత్రాలు !
అక్కడ

ఒక చినిగిపోయిన విస్తరి
దిక్కూ మొక్కూ లేక
కాళ్ళతో తొక్కేవాళ్ళను చూస్తోంది !
కన్నులారుస్తోంది !
ఎక్కడినుండో వచ్చారు కొందరు ముష్టివాళ్లు

విస్తరిని చూశారు
కోరిక విస్తరించినట్లుంది !
ముందు నేనంటే నేననుకొన్నారు !
ముష్టియుద్ధానికి దిగారు !

తనవంటి పనికిమాలినదానికోసం కూడా
ముష్టియుద్ధం చేసేవాళ్ళు
సృష్టిలో ఉన్నారని మురిసిపోతూ !

అప్పుడేవచ్చిన కొత్తగాలితో
చక్కా లేచిపోయింది !
చిరునవ్వు నవ్వుకొంటూ
చినిగిపోయిన విస్తరి !
దిష్టిబొమ్మల్లా మిగిలారు
ముష్టివాళ్ళు !

## ప్రాతిపదికలు

వెయ్యేండ్లు జీవించినా
వెలుగు ఎంత వెల్లివిరిసినా
అంధకారాన్నే ఆరాధిస్తాయి దివాంధాలు !

రుధిరం ధారబోసి
ఉదయాన్ని సృష్టించినా
తెల్లవారనే లేదంటారు తెలివిమాలినవాళ్ళు !

ప్రకృతి అంతా పల్లవించినా
వసంత శోభ వెల్లి విరిసినా
కారుకూతలే కూస్తాయి కాకులు !

కాంతి కవాటాలయిన
కన్నులు మూసికొని
శుక్లపక్షాన్నిగూడ
కృష్ణపక్షంగానే వల్లిస్తారు కొందరు!

ప్రేమించే హృదయానికి
ప్రపంచమంతా ఒక బృందావనం
ద్వేషించే హృదయానికి
లోకమంతా నరకప్రాయం !

కాళ్ళక్రింద నలగుతూన్నా
పరిమళాన్ని వీడవు పువ్వులు
నెత్తిపై పెట్టుకొన్నా
ప్రకాశించవు బండరాళ్ళు !

నమ్మితే రాతినయినా దేవుడంటుంది లోకం

నమ్మకుంటే దేవుడి మీద గూడ
రాళ్ళు వేస్తుంది పాపం !

రాళ్ళు రువ్విన వాళ్ళు రాక్షసులయినా
రసఫలాలనే ఇస్తుంది వృక్షం !

## మౌన శిల్పాలు

మనిషి చెక్కిన మౌన శిల్పాలు
మాట్లాడుతున్నాయి !
రమ్యంగా రసమహితంగా
గత కాలం చరిత్రను
నేత్రాలకు వినిపిస్తున్నాయి !
వాటికి యెదలేదు మేధలేదు
లోచనాలూ లేవు
వక్ర ఆలోచనలూ లేవు !
నోటిలో నాల్క లేదు
నొసటి చిట్లింపులూ లేవు !
అయినా మౌనంగా పలుకరిస్తున్నాయి !
గుండెల్లో కళామృతాన్ని చిలకరిస్తున్నాయి !
శిలలపై చెక్కిన శిల్పాలు
కల్పాంతాలవరకు మాట్లాడుతాయి !
అనల్పార్థాల నెన్నింటినో
అందంగా వినిపిస్తాయి !
మహాకావ్యాల నెన్నింటినో మౌనంగా
మనస్సుల్లో ముద్రిస్తాయి !
నవరస స్రవంతులను యెదలలో పొంగిస్తాయి
నేను
మౌనశిల్పాల భాషావిన్యాసాలను వింటూ
గుండెను మరామత్తు చేసికొంటున్నాను !
మనస్సులో కావ్యదీపికలను వెలిగించుకొంటున్నాను !

# శేషప్రశ్న ??

పింగళి జగన్నాధరావు.

కాలచక్రం జరిగిపోతున్నది
కలల కపురం కరిగి పోతున్నది
గతి తప్పిన విజ్ఞానం
గాలికెగిరి పోతున్నది...

ధర్మానికి దూరంగా
న్యాయానికి భారంగా
కాలానికి విపర్యయంగా
కర్తవ్య విమూఢంగా

కాలచక్రం జరిగిపోతున్నది
కలల కపురం కరిగిపోతున్నది...
ఇజా లెక్కవౌతున్నవి
నిజాలను పడద్రొక్కుతున్నవి !

సజావులూ నిజాయితీలు
గ్రుడ్ల నీళ్ళను గుక్కుకున్నవి !
గమనవేగం పెరుగుతున్నది
కాని, గమ్యం దూరమౌతున్నది !

గడించిన విజ్ఞానమూ...
గాజుకళ్ళలా మెరుస్తున్నది...

అధ్యయనం చేసిందానికంటే
అనుభవం బరువెక్కువయింది
ఆచార్య దేవోభవ వాక్యానికి
అర్థమన్నది మృగ్యమైంది !!

కాటుక కంటినీరు కాలువలై
కపోలాలమీద కారుతుంటే
చదువుకునే వాళ్ళెవరురా అని
సరస్వతి ఏడుస్తున్నది......

కాని, వీటితో నిమిత్తం లేకుండానే
కాలచక్రం జరిగి పోతున్నది......

పౌరసత్వం పురోగమిస్తున్నది
వారసత్వం తిరోగమిస్తుస్తున్నది
మా తాతలు నేతులు తాగారని మనం
మూతులు తుడుచుకోటం కనిపిస్తున్నది
అనాగరికులు రాళ్ళతో కొట్టుకుచస్తే
నాగరికులు రాకెట్లతో కొట్టుకుంటున్నారు !

దేశాన్ని నిర్మించాల్సిన
యువతరం బాధ్యత విస్మరిస్తే
కాదా ! అది దేశానికి మహారిష్టం ??

అనిపించడం లేదా ? దేశ మేమవుతుందోనని !
ఆందోళన లేదా ? భవిష్యత్తేమిటోనని !
ఎవరిదీ దోషం ? ఎవరిదీ బాధ్యత
అనుభవించే అమాయకులదా ?
అశుభం శుభం తెలియక దూకే అగ్గిమీది మిడతలదా ?

విద్యార్జన చెయ్యటానికి - విధ్వంసంతో పనిలేదు !
పాపులారిటీ రావాలంటే - బందిపోటు కానక్కర్లేదు !
చెరువుమీద అలిగితే-దాహం తీరదు.
చదువు మానేస్తే దేశం - సస్యశ్యామలం కాదు !

చంద్రలోకానికెగిరేటప్పుడు - ఛంఘిజ్ ఖాన్ పద్ధతులెందుకు ?
శ్రద్ధలేనిదే విజ్ఞానం - రాదు రాదు మన ముందుకు !
కాపీకొట్టి తెచ్చుకున్న కాగితం ముక్క
కరకు జీవితం కళ్ళు కప్పటానికి చాలదు.

ఇప్పుడు చెబితే ఇది - అర్థమయ్యే నిజంకాదు.
బ్రతుకు బాటలో - బండి పడినప్పుడు కానీ తెలియదు.
ఇట్లాగే సాగిపోతే
ఏమవుతుందీ ప్రపంచం ? ఏమవుతుంది ??
ఇది ఇక్కడేకాదు - ఖండ ఖండాంతరాలల్లో
సర్వజన హృదయాంతరాళాలల్లో
కుదిలించి గుండెలు కుప్పచేసే ప్రశ్న !
సమాధానం లేని ప్రశ్న !
ఇది శేష ప్రశ్న !!
కాలచక్రం జరిగిపోతున్నది !
కలల కపురం కరిగిపోతున్నది !!

## ఉషస్సు

ఉషస్సులు ఉత్సాహంతో ఉరకలేస్తున్నవి !
తమస్సుల యవనికలను తుత్తునియలు చేస్తున్నవి !
అనైక్య భారతంలో
సమైక్యనాదాన్ని చాటాలని
కుళ్ళుతున్న వ్యవస్థలో
కుందమందారాలను కురిపించాలని
హేతుభూత నిర్వేద ప్రవాదాల స్థానంలో
అసలు సిసలైన ఆధ్యాత్మికాన్ని అందించాలని
ఉషస్సులు ఉత్సాహంతో ఉరకలేస్తున్నవి !
తమస్సుల యవనికలను తుత్తునియలు చేస్తున్నవి !

ఛప్పన్నారు దేశాలని చాటి చెప్పే
స్వల్ప బుద్ధులకూ
అంగ వంగ కళింగ కాంభోజాలనే
లంబోదరులకూ
అభిజ్ఞాన శాకుంతలాన్ని వినిపించాలనీ
అఖండ భారతాన్ని గుర్తుకు తేవాలనీ
ఉషస్సులు ఉత్సాహంతో ఉరకలేస్తున్నవి !
తమస్సుల యవనికలను తుత్తునియలు చేస్తున్నవి !

ఇది ఈనాటిది కాదు
అనాదిగా వస్తున్నది
సమైక్య సిద్ధాంతం మన
మూలుగల్లో వినిపిస్తున్నది
ఇనకిరణంలో అణగి ఉన్న
ఇంద్ర ధనుఃఖండంలా
మహా శాఖాయిత వటవృక్షానికి
మూలమైన స్వల్ప బీజంలా
మన సంస్కృతిలో అణగిఉన్న
మహిత మహాసత్యం ఇది !
మన నాగరికతలో మాటుగొన్న
మహా మహత్వం ఇది !!
తన గమనంలో ఎన్నో మలుపులు
తిరిగిన మన జీవనస్రవంతి
పర్వతాల నధిగమించింది ।
లోయల్లో పొంగిపొరలింది !
మహోన్నత మహిమాలయ
మహిత శిఖరాల కెగసింది !
మానవత్వపు అవధి ఇది యని
మూల మూలకు చాటింది !
మనలో మనకన్నప్పుడు
పాండవ కౌరవులము !
పగవానికి మటుకు మనము
పంచోత్తర శతము !!
అందుకని ఓ కవీ !
నిన్ను నువ్వెప్పుడూ కించపరుచుకోవద్దు !
నిత్య నూత్నమైన నీ సచ్చరిత్రాన్ని
నిందాపాత్రం కానీవద్దు !!
నువ్వు నమ్మిన సత్యాన్ని నిస్సంకోచంగా ప్రపంచించు !
భారతీయ సంస్కృతిలోని సౌరభాన్ని గుబాళించు !!
నీ దేశాన్ని సత్యపథంవైపు మళ్ళించు !
నీ కలాన్ని సమైక్యంవైపు త్రుళ్ళించు !!
ఉషస్సులు ఉత్సాహంతో ఉరకలేస్తున్నవి !
తమస్సుల యవనికలను తుత్తునియలు చేస్తున్నవి !!

# సృష్టికర్తను

వి. జయప్రభ

మానస సరోవరాన
మన్మథాంతకుని మనోహారిణి
జడపాయల సుమ సుగంధాన్ని !!
శివుని మూడవ కంట నిండిన
ప్రచండ నయన జ్వాలికను
నీరవ నిశీథిలో మెరిసే చుక్కలనుంచి
జాలువారే నిశ్శబ్ద తరంగాన్ని
సాగర మథనోద్భవామృత శీకరాన్ని,
కటిక పేదల కడుపు కొట్టే
దుష్ట శక్తుల దునుమడించే
ప్రచండాద్భుత వజ్రఘాతాన్ని
హీనరసికుల సృష్టి చేసిన
ఇనప గోడల కావ్య దుర్గము
కూల్చి వేసే ప్రళయ దుర్గను
దీన జనులకు అభయ హస్తను
చిన్ని పాపల చిరు నవ్వును
బడుగు వారికి బ్రతుకునిచ్చే
కొత్త పుడమిని సృష్టి చేసిన
క్రాంతి దేవిని - సృష్టికర్తను.

# సంధ్యా దృశ్యం

అరుణ వర్ణాన్ని ఆకాశమంతా అలిమి
అదృశ్యమైపోయింది సూర్య బింబం
కెంజాయకే కంది నీలితనాన్ని నేలపై వదలి
ఎరుపెక్కిపోతున్నాయి మేఘమాలికలు
శ్యామ వర్ణాన్ని కోమలంగా గైకొని
తూరుపు శిఖరారోహణం చేసే నెలరేడు

సొగసులకి సెగ రేపుతాడనేమో ! మరి,
జలతారు మేలి ముసుగేసుకుంది పృధ్వి !
పశ్చిమాన సంధ్యారాగం వీడకముందే
ప్రాగ్దిశ జ్యోత్స్నపూరితమైపోయింది
వెన్నెల ప్రభావంతో ఎరుపుతనాన్ని వదలి
పాలమేఘాలు శాంతిదూతల్లా అంబరాన సాగిపోతున్నాయ్
తళుకు చుక్కలు దారి చూపుతూంటే
రానే వచ్చాడు చంద్రుడు !
కిరణాల తాకిడికి, వేసుకున్న వల్లెవాటు కరిగిపోగా
తనలోని అందాలు పాలకాంతిలో ప్రతిఫలిస్తూంటే
సుధాకరుని మృదుచేష్టలకు తాళలేక
ప్రణయానికి లొంగిపోయి
చాచిన వెన్నెల హస్తాన్ని
ప్రేమభావాన పెనవేసుకుంది ధరణి !

# నిశ్శబ్ద సంచలనం

ఎవరూలేని ఏకాంతవేళ
మధురోహలు రొదపెడుతూంటే
ఆవరించిన నిశ్శబ్దం అమృతంలా ఉంది !
ఎంత నిశ్శబ్దం ! !
సకల ప్రపంచమూ జలప్రళయాంబుధిలో మునిగిపోయి
సమస్త ప్రకృతినీ నాకే ధారాదత్తం చేసినట్లుంది !
నీలాంబరాన పాలమేఘాలు దూదిపింజలై తేలిపోతూంటే
శ్వేత సూర్యుని కాంతి కిరణాలు
నీరద సముదాయముపై మల్లెకాంతితో పడుతూంటే
పాలకడలి పొరలి పొరలి పొంగుతున్నట్లుంది
ఇప్ప పూ చీర సింగారించిన భూమి వనకన్యలా ఉంది !
కిచ కిచ మనే పిచ్చుక కేరింత ప్రకృతి పెళ్ళికి బాకాలా ఉంది !
సమీపాన ప్రకృతి కోలాహలం కవ్విస్తూన్నా
స్వార్థజీవుల సంచలనం లేక పటాటోప ప్రతిధ్వనులు లేక
ప్రశాంతంగా !
లోకం నాకంలా ఉంది ! శాంతి కపోతంలా ఉంది !!
అంతులేని ఈ నిశ్శబ్ధ వాహినిలో పడి
ఇలా ఎన్నో యుగాలు ప్రవహించాలని ఉంది !

ప్రకృతిలోని పూర్ణ సౌందర్యాన్ని స్పృశించి, పరవశించే
మలయ పవనంలా
శూన్యమంతా నేనై నిండాలనుంది;
చెట్ల అకుల పుట్టివెడలిన పక్షికూజితాన్నై
భువన భువనాల మార్మోగాలని ఉంది
రంగుల పూరేకుల పరిమళాలు విరజిమ్మి
పూదేనెతో తేటి నలరించాలనుంది;
ప్రకృతికే అలంకారాన్నై పరవశించిపోవాలనుంది.
ప్రకృతిలోని ఒక రేణువునై కలిసిపోవాలనుంది.
నా చిన్ని హృదయాన ఇమడలేని
ఈ ఆనందాతిశయంతో తపించలేక
ఈ అనంతానుభవాన్ని ఆస్వాదించలేక
ఈ నిశ్శబ్దంలో కలిసిపోవాలనుంది
ఈ నిశ్శబ్దాన్ని నేనై నిలచిపోవాలనుంది

# జీవనం

భూమి పుట్టిందగ్గరనుంచీ
సృష్టి జరిగిందగ్గరనుంచీ
క్రీస్తు పూర్వం నుండి క్రీస్తు శకం దాకా
రాతినుండి ఇనుముదాకా
నాటినుండి నేటిదాకా
డేంజర్లను దాటుకుంటూ
ఢక్కామొక్కీలు తింటూ
బ్రతుకుతూ చస్తూ
చస్తూ, బ్రతుకుతూ మానవజీవనం
వికసించిన నవనాగరికతా కుసుమ మధువనం
పరిణామాలను పరిశీలిస్తే
పది ఉద్గ్రంథాలు రాయొచ్చు
పబ్లిషర్లను పట్టుకుని అచ్చులో చూసుకోవచ్చు
మారినదేమిటయ్యా అంటే-
అప్పుడు పచ్చిగా తిన్నాం
ఇప్పుడు పచ్చిది వెచ్చగా కాల్చుకు తింటున్నాం
ఆకుల కట్టాం, హాయిగా తిరిగాం
పట్టుని కప్పుకుని మడి

కట్టుకోవడం మాత్రం నేర్చాం
పచ్చి ప్రేగుల్లో మాంసపు పోగుల్లో పడిదొర్లినా
వాసన లేనివాళ్ళు - వాళ్ళు
ఉడుకులాంలో ఉరినా
వాసన వేస్తున్న వీళ్ళు-
నాగలి పట్టినా, ట్రాక్టర్లు తొక్కినా -
పడుతున్నది ఒకే అవస్థ !
ఏం మారింది ఈ వ్యవస్థ ?
మనిషి మారేడు-
బాహ్యంగా, ఆడంబరంగా, నవనాగరికంగా
కాని మనసు మాత్రం సృష్టి పరిణామదృష్ట్యా
మనిషినుంచీ మృగంవైపు తిరోగమిస్తోంది
విజ్ఞానం వెల్లివిరిసింది
కాలుకదిపితే నాకలోక భోగాలు
అన్నీ ఉన్నవాడికీ, అనుభవించేవాడికీ -
ఏమీలేనివాడిగతి
ఏ యుగంనుంచీ ఒకేస్థితి.
మన్వంతరాలు మారాయి
అంతరాలు పెరిగాయి
మనషులంతా విడిపోతున్నారు,
దేశాలుగా, రాష్ట్రాలుగా, ఇంకా ఇంకాగా-
చివరికి మనిషిగా కూడా
మిగలలేకపోతున్నారు.
కొట్టుకుంటున్నారు, చంపుకుంటున్నారు
సృష్టి అంతానికై పట్టుబడుతున్నారు
ప్రాక్పశ్చిమాలైనా ఉత్తరదక్షిణాలైనా
అన్నిచోట్లా జరుగుతున్నది ఒకే కథనం
మారాలి మారాలి ఈ రకపు జీవనం
మనిషికిక రావాలి రావాలి, పునరుజ్జీవనం.

# కృష్ణ పక్షం

అయలసోమయాజుల నాగేశ్వరరావు

వసంతం వచ్చినా, కోయిల కూయలేదు
      లేమావి చివురులు మేయలేదు
'శిశిరం' ఆకుల కన్నీళ్ళను
జలజలా కురిసి, విలపించింది
హేమంతం మంచు కన్నీటి బిందువులను
      చిందిస్తూ రోదించింది
శ్రావణ మేఘం తన ఆపుకోలేని దుఃఖాన్ని
వానగా కురిసేసింది
నీలి మబ్బు కదిలినా వనమయూరి
వలపునాట్యం మాని విలపించింది
శరత్కాలపు వెన్నెల వేడెక్కింది
ఆకాశంలో తీతువు
"కృష్ణా, కృష్ణా" అంటూ విలపించింది
మల్లెలమాసమయినా సిరిమల్లియ
విరియడం మానేసింది
తేనెలొలికే తెలుగుతల్లి మూగబోయింది
తెలుగుభారతి వీణియ అపశ్రుతులు పలికింది
క్షణకాలం ప్రకృతి స్తంభించింది
పురోగతిలేదనిపించింది
తెలుగు సాహిత్యాకాశంలోని
రాకానిశాకరునికి
శాశ్వతకృష్ణపక్షం ఆవరించింది *

# గుణపాఠం

"ఎవరునువ్వు ?
భయంకరమయిన ఆ కళ్ళేమిటి ?
ముడతలుపడ్డ ఆ ఒళ్ళేమిటి ?
ఒంటినిండా ఆ తూట్లేమిటి ?
వాటిపై ఆ కట్లేమిటి ?

ఎండి బీటలువారిన
ఆ నెత్తురు మరకలేమిటి ?
మెడలో ఆ పుర్రెలేమిటి ?
చేతిలో ఆబుర్రలేమిటి ?
చెరిగిన జుట్టేమిటి?
చిరిగిన బట్టేమిటి ?
ఎందుకలా రోదిస్తున్నావ్ ?
ఎవరు నిన్ను బాధిస్తున్నది ?''
అని అడిగిన వర్తమానాన్ని చూచి
గతం నవ్వింది
నీకు తెలియదా !
నేనుగతాన్ని, కాలానుగతాన్ని !
నేనూ ఒకప్పుడు నీలాగే
అందంగా శరత్కాలపువెన్నెలలా నవ్వేదాన్ని
వసంతకాలపుకోయిలలా గానంచేసేదాన్ని
వర్షాకాలపు సెలయేరులా
తుళ్ళుతూ పరవళ్ళు తొక్కేదాన్ని
హేమంతంలో విరిసిన చామంతిలా మెరిసేదాన్ని
గ్రీష్మానంతరం చిగిర్చిన తరువులా
కొత్తఅందాలను సంతరించుకునేదాన్ని
శ్రావణమేఘాన్ని దర్శించిన మయూరిలా
పరవశించి నాట్యంచేసేదాన్ని
బాలభానుని అరుణకిరణంలా భాసించేదాన్ని
మధ్యందినమార్తాండునిలా శాసించేదాన్ని''
''మరి ఎందుకిలా అయావ్ ?
నిన్నెవరిలా చేశారు ? ప్రశ్నించింది వర్తమానం
''ఒకరేమిటి అందరూ బాధ్యులే
మతకలహాలు దారుణమారణహోమాలు
కులమత విద్వేషాలు
విదేశీయుల దండయాత్రలు
స్వదేశీయుల అంతఃకలహాలు
మహారాజుల హుంకారాలు
మఠాధిపతుల అహంకారాలు
కోటబురుజుల సింహనాదాలు

కోవెలగంటల ఓంకారనాదాలు
పానిపట్టులు - పలనాడులు
అంటరానితనం - ఆకలిచావులు
సరిహద్దువివాదాలు - భాషాభేదాలు
నదీజలాలపంపకాలు - జాతీయపనరుల పంపకాలు
అవినీతి - లంచగొండితనం
అన్యాయం - అక్రమం
రంగుమారినధనం - రంగులుమార్చే నాయకులు
గుడిలోని పూజారులు - బడిలోని పంతుళ్లు
అంతా తలోచెయ్యివేసి సన్నిస్థితికి చేర్చారు
ఇప్పటికయినా బుద్ధికలిగి మసలుకో
గతం భవిష్యత్తుకి పునాదని తెలుసుకో
గతాన్ని అర్థంచేసుకుని
వర్తమానంలో కర్తవ్యాన్నెరిగి
ఉజ్వలభవిష్యత్తుకై కృషి కొనసాగించు
లేనినాడు
నాకు పట్టినగతే నీకూ పడుతుంది
నేను చేరిన దశకే నిన్ను చేరుస్తుంది
ఈనాటి నీవుకూడా
రేపటిచరిత్రగా మారిపోతావ్
అనంత కాలగర్భంలో కలిసిపోతావ్
నాపలె చరిత్రహీనవవుతావ్ *

## క్షణం జారిపోయింది

ప్రవహించే జలంలా
ప్రసరించే కిరణంలా
ఊపిరితీసే జీవంలా
శరీరాన్ని విడిచిన ప్రాణంలా
కృష్ణ పక్షపు వెన్నెలలా,
ఉదయభానుని అరుణ కిరణాలకు, –
కరిగిన మంచు బిందువులా.

క్షణంజారిపోతుంది,
కాలం కరిగిపోతుంది,
అందుకే కాలాన్ని వృథా చేయకు,
క్షణాన్ని జారిపోనివ్వకు–

జీవితం—
క్షణక్షణం నూనె తగ్గుతున్న దీపంలాంటిది,
దీపముండగానే యిల్లు చక్కపెట్టుకో !
నీ దేశాన్ని చిక్కపట్టుకో !
అసలే కుళ్ళిన ఈ సమాజాన్ని,
మరింత మురుగపెట్టకు—
ఉప్పునీట సముద్రంలో మరింత ఉప్పును కలుపకు—
దిగజారుతున్న విలువలను పాతాళానికి నెట్టకు—
ఎగబ్రాకుతున్న అన్యాయాలకు జేకొట్టకు—
సమాజంలో మనిషి-
కొరివిలా కొంపలకు నిప్పుపెట్టకూడదు—
కాగడాలు మార్గదర్శకత్వం చెయ్యాలి—
కొవ్వొత్తిలాగా తాను కరుగుతూ కాంతినందించాలి—
అందుకే—
నీవు కొవ్వొత్తిలా వెలుగుతూ,
మిగిలిన సమాజానికి వెలుగులందించు,
నీవు కరిగిపోతూ—
మిగిలిన సమాజానికి వివేకాన్ని పెంచు—
క్షణాన్ని క్షణమయినా జారనివ్వకు—
జారినక్షణం మళ్ళీరాదు— *

# పువ్వు

జీవితం క్షణభంగురమని-
బాగా ఎరిగిన యోగి,
బ్రతికినంతకాలము-
మహారాజులా బ్రతికే భోగి-
తనరంగులలో ఈ జగాన్నే మురిపిస్తుంది-
తన నవ్వులతో ఈ లోకాన్నే మరిపిస్తుంది-
తాను నలుగుతూ ఇతరుల కానందం ఇస్తుంది-
తాను వాడుతూ ఇతరులకు పుణ్యం ఇస్తుంది-
జడలో చేరి - అలరిస్తుంది-
గుడిలో చేరి - అలంకరిస్తుంది
అదే — పువ్వు. *

# సూర్యుని హత్యా?

ఎస్. నారాయణరెడ్డి

అది సంధ్యాసమయం, చీకటి వెలుగుల తుది సమరం
ఇరుల వురులలో చిక్కుకొని ఇను డస్తమించాడు
చీకటి రాక్షసి కబంధ హస్తాలలో సూర్యుడు హత్యచేయబడ్డాడు
ఆకాశమంతా రక్తమే, ఒళ్ళు జలదరించే దృశ్యమే
జీవరాశిలో కలవరం బయలుదేరింది
ప్రాణులన్నీ పారిపోయి గూడు చేరుకున్నాయి.
అంధకారం అట్టహాసంతో అంతా ఆవరించుకుంది
నల్లధనం నక్కలు వికటాట్టహాసం చేసాయి
చీకటిబజారు గుడ్లగూబలు ఒళ్ళు విరుచుకున్నాయి.
ఒక సూర్యుడు మరణిస్తేనేం, చీకటి విశృంఖలత్వాన్ని
ఎదిరించడానికి

కోట్ల తారలు ప్రభవించాయి
ఈ చీకటి వెలుగుల పోరాటంలో
ఎన్ని తారలో నేల రాలక తప్పదు
అయినా, ఈ చీకటి రాజ్యం ఇంకెన్నాళ్ళో సాగదు
అదుగో తూరుపు గర్భం చీల్చుకొని, రక్తం
సూర్యుడుదయిస్తున్నాడు

అది పసికట్టిన చీకటి మెల్లగా జారుకుంది
చీకటి రాజ్యంలో విర్రవీగిన గుంటనక్కలు
సద్దుమణిగాయి, తోకముడిచాయి. *

# రేపు

నేడస్తమిస్తున్న సూర్యుణ్ని చూసి నిరాశ చెందకు
నీ ఆశలన్నీ, రేపుదయించే అరుణభానుడిపైనే

నేడణచబడ్డ విప్లవాలను చూసి చింతించకు
నీ ఆశలన్నీ చైతన్యవంతమై ప్రభంజనంలా లేచే
రేపటి యువతపైనే
నేడు నీ ఆశయసాధనలో పొందుతున్న కష్టాలకు బెదరకు
రేపు నీవు స్థాపించే సమతా సామ్రాజ్యంలో
సుఖాలగూర్చి తలంచు
నేడు కలం పట్టిన నీ చేతులకు బంధాలని భయపడకు
రేపటి మేల్కొన్న ప్రపంచంలో నీ భావాలకు ఎదురేదీ? *

# ఎవరిదా పాపం ?

నగరం నడిబొడ్డులో, విశాలమైన భవనాలతో
అందరినీ ఆదుకొనే ఆసుపత్రి, ధర్మాసుపత్రి
ఆసుపత్రికి ఆనుకొనే పేవుమెంటుమీద
మనలోని మానవతను ప్రశ్నిస్తూ,
కరుణను సవాల్ చేస్తూ,
నిజాయితీని సవాల్ చేస్తూ
పడివుందొక కళేబరము, వచ్చే పోయే ప్రాణాలతో
ఎండతో యెండుతూ, వానలో తడుస్తూ,
దుర్గంధ వాతావరణంలో
ముసిరే ఈగలతో, కసురుకొనే మనుషులతో
పడివుందొక జీవచ్ఛవం, ఆసుపత్రికి ఆనుకొనే !
ముప్పూటలా దేవుని కొలిచే భక్తులు
ముప్పదిసారులు తీర్థయాత్ర చేసిన పుణ్యాత్ములు,
అరుదైన బిరుదుల భుజకీర్తులు తగిలించుకొన్న సంఘసేవకులు
ఎందరో ఇంకెందరో వస్తూ పోతున్నారా త్రోవలో
ఆ దుర్గంధాన్ని భరించలేక ముక్కులు మూసుకొంటున్నారు.
ఈ మన పవిత్ర దేశంలో అలనాడెపుడో
రంతిదేవు డుదయించాడట, శిబి జన్మించాడట
బుద్ధు డవతరించాడట, మొన్న మొన్ననే
ఒక మహాత్ముడు, ఒక అహింసావాది

మానవసేవయే మాధవసేవ అన్నాడట.
మరి ఈ నాటి మనుషులు ఆత్మను అమ్ముకున్నారా!
హృదయం తాకట్టు పెట్టారా? కేవల
స్వార్థమే కరడు గట్టిందా? మనసు కొడిగట్టిందా?
ప్రక్కనే అంత పెద్ద ఆసుపత్రి ఉన్నా,
ఆ మనిషిని ఆదుకోరేం, మానవతను నిరూపించుకోరేం,
ఆ మనిషే చస్తే ఎవరిదా పాపం?
నాదా? నీదా? ఈ సమాజానిదా?
లేక కుళ్ళిన ఈ వ్యవస్థదా? దేశానిదా?
ఎవరిదా పాపం? *

# సామాన్యుడు

వాడు రోజంతా కష్టపడి యజమానికి
ధనం పంటలు పండిస్తాడు
ఆ ధనంతో యజమాని ఆకాశాన్నంటేహ ర్మ్యాలు నిర్మిస్తాడు
వాడు రెక్కల కష్టంతో యజమానికి
మేడలు, మిద్దెలు కట్టిస్తాడు
కాని వాడికి మాత్రం నిలువ నీడుండదు
తలదాచుకొన గూడుండదు.
వాడు తన కష్టంతో యజమాని బొజ్జ నింపుతాడు
కాని తనకే తినడానికి కూడుండదు,
పస్తుండని రోజుండదు.
వాడి పిల్లలు వాళ్ళ ఎంగిలి మెతుకులతో
అన్నప్రాశ మారంభిస్తారు.
వాళ్ళ మాన ప్రాణాలు యజమానుల దయాదాక్షిణ్యాలకు తాకట్టు
వాడొక్కడే ఎదురు తిరిగితేయజమానుల ఆటకట్టు. *

# ప్రగతి పథం

నేస్తం నే చెప్పినట్లు నడు
ప్రగతి పథంలో అడుగిడు
నాకేదీ తెలియదనుకోవడం తప్పు
అదే తెస్తుంది నీ జీవితానికి ముప్పు

అణగినంతకాలం నిన్నణచుతుందీ లోకం
ఎదురుతిరిగితేనే మననిస్తుందీ కాలం
న్యాయాన్ని అణగదొక్కి
అన్యాయం అట్టహాసం చేస్తోంది
పట్టపగలే వెలుతురును పారద్రోలి
చీకటి రాజ్యమేలుతోంది
మనుషులలో చైతన్యం నశించింది
స్పందించే లక్షణం లోపించింది
సమాజంలో స్తబ్దత ఆవరించింది
మనిషి మనుగడ అంతిమదశకు చేరింది
అందుకే శ్రమకు ప్రతిఫలం ఆశించు
దోచేదొంగల ఆటలు కట్టించు
నిలబెట్టి నీవంతు రాబట్టు
రాబందుల ఆటలు కట్టు
అవినీతిని నిర్మూలించు
అన్యాయాలను అరికట్టించు
ఓర్పు మంచిదే కాని
అది నీ జీవితానికి తుది తీర్పు కారాదు
శాంతి మంచిదే కాని
అది నీ జీవితంలో అశాంతికి కారణం కాకూడదు
ఎంతకాలమని ఈ అన్యాయాలు
ఇంకెంతకాలమీ దోపిడీలు
నిజం నిన్ను పిలుస్తోంది
న్యాయం నిన్ను రమ్మంటోంది
ఈ మనుషులంతా శక్తిచచ్చి చచ్చుపీనుగలయ్యారు
ప్రతిదానికి తలలూపే గంగిరెద్దులయ్యారు
ఓ మనిషీ నీలో రక్తమాంసాలున్నాయా ?
ఉంటే మేలుకో! తన్నినా చలనం లేదేం
ఊసినా తుడుచుకుంటా నంటావేం
మనిషిలో నిస్పృహను నేను సహించను
సమాజంలో క్రాంతిని నే వాంఛిస్తాను
ఇప్పటికైనా కన్నువిప్పు
లేదా రావచ్చు నీ అస్తిత్వానికే ముప్పు.

# గగనకుసుమాలు

అయ్యదేవర పురుషోత్తమరావు

ఆకాశంలో మినుకు మినుకుమంటున్న చుక్కలు
అందని గగన కుసుమాలు
నీలాకాశంలో మబ్బులు తేలియాడుతున్నయి
ఉన్నవాడు ఊహకంతులేకుండా ఊళ్ళేలుతున్నాడు
నిండుకుండ నిలకడగా తొణకనంటున్నది
కలిగినవాడు కలకాలం కరువెరగనంటున్నాడు
ఇహంలో పదిమందికి పనికిరాని పాపిష్టివాడు
పరంలోనూ పాపమే మూటకట్టుకుంటున్నాడు
ఇక్కడ యింత యిచ్చి పుచ్చుకోలేనివాడు
ఎక్కడో వెలగబెడతాడని ఎలా నమ్మకం ?
నీ వూరే నీకు యింత మంచిగానప్పుడు
పొరుగూరి పట్టాభిషేకం ఎలా కుదురుతుంది ?
మంచిపనికి మహా మంచి ముహూర్త మెందుకు ?
పరమేష్ఠి సృష్టికి తగుదునని తప్పుపట్టినట్లు,
కానిపనికి కుకాలాన్ని కలిసి రానీయకు
ఎదటివాడికి ఎంత ఉండి ఏంలాభం ?
తనదంటూ అంతో యింతో ఉంటే తప్ప
అర్ధనారీశ్వరుడు గంగమ్మను నెత్తినెక్కించుకున్నా
విష్ణువు మాలక్ష్మిని వక్షంలో విలక్షణంగా నిలుపుకున్నా
బ్రహ్మ వాణిని వాక్కున మక్కువతో వెలయించినా
అందినంత వరకే ఐశ్వర్యం తరువాత అది శనేశ్వరం. *

# అనుభవం

అనుభవం ఏమంటున్నది ?
సన్నగా నవ్వి ఊరుకుంటున్నది
నన్ను కదిలించకు - తరువాత వదిలించుకోలేవంటున్నది
కాదు కూడదంటే — కుండ బద్దలుకొడతా నంటున్నది
ఉన్నమాటంటే ఉలుకేగామరి,
జీవితం తీపి పులుపేగాదు
వగరూ చేదూ కూడా అంటున్నది
మంత్రసాని తనం ఒప్పుకున్న తరువాత
ఏదివచ్చినా పట్టాలంటున్నది
గతం ఒరిగించింది లేదు కాబట్టి
వర్తమానం వక్రగతులకే నిలయం కాబట్టి
భవిష్యత్తులో ఎండమావులే అంటున్నది.
అనుభవం ఏ మంటున్నది ?
ఆశ జీవితానికి సోపానం అంటున్నది
అందుకే మనుగడ సాగించా లంటున్నది
పేరుచూసి భయపడవద్దంటున్నది
పేరులో ఏముంది నా బొంద
దేనికైనా పెట్టిపుట్టా లంటున్నది
ఎన్ని ఉగాదులు మారినా - అనాదిగా వస్తున్న
'చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ'అంటున్నది.
ఎంత చెప్పినా ఏం ప్రయోజనం లేదు.
కష్టమో నిష్ఠూరమో చేయదలచుకొన్నది చేసెయ్యమంటున్నది
'ఆలస్యం అమృతం విషం'-అంతమాత్రం తెలియదా! అంటున్నది
ప్రకృతిలో లేదు మార్పు పురుషుడిలోనే ఉందంటున్నది
చేతులు కాలింతరువాత ఆకులు పట్టుకోవద్దంటున్నది
ఓర్పు-నేర్పు-కూర్పు-మార్పు మనిషికి జీవలక్షం అంటున్నది
అనుభవం ఏమంటున్నది !
గతం వర్తమానానికి పునాది అంటున్నది. *

# పిలుపు

అయ్యా ! రండి ! ! అమ్మా ! రండి ! !
మీ రందరూ రావాలి - ఇది ఏ ఒక్కరి యింట్లో పెండ్లిగాదు
ఇది విశ్వమానవ కల్యాణం !

అందరూ తలాఒక చెయ్యి వేస్తేనే గాని జరిగేదికాదు
బాబూ ! మీరూ రావాలి ! ! అమ్మా ! మీరూ రావాలి ! !
ఆలస్యం చెయ్యకండి!-మా చేతనేమౌతుందని అలసత చెందకండి

'ఉడుతా భక్తి' అన్న సామెత మీరెరుగరా ?
మీలో 'నీలులు' ఎందరున్నారో ఎవరికెరుక !
ఇక స్వామి కార్యమే స్వకార్య మనుకొనే హనుమంతు లెందరో?

ఈ పల్లకీ అందరూ మోయవలసిందే
ఇక మీరు ఆలోచించకండి - మీభుజంకూడ అనించండి
ఇది ఏ మహారాజు తలపెట్టిన కార్యమూ గాదు

ఈ యుగంలో ప్రతి పౌరుడు మహారాజే
ఆజ్ఞాపించేవాడు లేడు - పాలించటం తప్ప
మనిషి మనీషిగా తలచిన మహాయాజ్ఞం యిది
దయచేసి అందరూ పాలే పోయండి !

ఇది మన యింట్లో పెళ్ళి - ఇక్కడ అంతా మనవాళ్ళే
ఈ కార్యం మీనుంచే కావాలి - మీ చేయి తగలాలి
ఏ ఒక్కరూ వెనుకాడకండి - అందరికీ మేలుచేయండి.

ఇది అందరి అభ్యుదయం అకాంక్షించే మహాయజ్ఞం
అందరూ తలాఒక సమిధ వేస్తేగాని కొనసాగేదికాదు.
మానవసేవే మాధవసేవ - మంచి, మమత
మానవజాతికి మరోపేరు-మంచికార్యమే మహాయజ్ఞం *

# అవసరం

వయసుకు సొగసు
వలపుకు వయసు-
కవితకు ధ్వని
మనిషికి పని-

శక్తికి యుక్తి
భక్తికి రక్తి-
స్నేహానికి త్యాగం
రాగానికి యోగం-

సంగీతానికి శ్రోత.
దేశానికి నేత-
ప్రగతికి ధనం
ప్రజలకు వివేచనం-

జీవితానికి ఆశయం
మంచికి న్యాయం-
మహాత్ముని మార్గదర్శనం
మహాకావ్య సందర్శనం *

# మైనస్ × మైనస్ = మైనస్

డా॥ నాగినేని భాస్కరరావు

''ఎవరీ పిరికి వెధవలు ?''
''ఎవరీ వాజమ్మలు ?''
కాస్త నెమ్మదిగా మాట్లాడు మిత్రమా-
ఎవరైనా వినగలరు
వీళ్ళు ఎవరని అడుగుతున్నావ్ ?
వీళ్ళు - చాలా గొప్పవాళ్ళట
టన్నులకొద్దీ గత చరిత్రనూ
కిలోల కొద్దీ ప్రక్కవాడి చరిత్రనూ
గ్రాములకొద్దీ తమ పార్టీ చరిత్రనూ-
డెసిగ్రాములకొద్దీ తమ నాయకుల చరిత్రనూ-
మిల్లీ గ్రాములకొద్దీ తన చరిత్రనూ-
చెప్పుకుంటూ-
సప్తవర్ణాలను తనలో యిముడ్చుకునే
ధవళ వర్ణవస్త్రధారులై
తమస్వార్థాన్ని, కులతత్వాన్ని, లంచగొండితనాన్ని
ఆశ్రిత పక్షపాతాన్ని, స్త్రీలోలత్వాన్ని, అరాచకత్వాన్ని
అసత్య భాషణాన్ని-అధికారముద్రలతో కప్పివేసి
అపర ప్రజాబంధువుల్లా
'ప్రజాధనాన్ని'–
మిల్లీగ్రాముల కొద్దీ ప్రజలకు
సెంటీగ్రాములకొద్దీ వన ప్రాంతానికి
డెసీగ్రాముల కొద్దీ తమ పార్టీకి
కిలోగ్రాముల కొద్దీ తనబంధువులకు,
టన్నులకొద్దీ తనకూ పంచేసుకుని
నోటికి వచ్చింది మాటగా
చేతికి వచ్చింది చేతగా
బుర్రకువచ్చింది శాసనంగా
'పెజా సామ్యం' అంటూ
బ్రతుకుతున్న వాళ్లు వీళ్లు,

తమ మీద తమకే నమ్మకంలేని
వీళ్లంతా మనల్ని ఏలుతున్నారు.
'డెమోక్రసీ' (Democray) అంటే ప్రజాస్వామ్యంలో-
అందులో మన 'పెజా సామ్యం' లో
దాపురించిన వెధవతత్వం-'' ''-
అదే వీళ్ల వేదాంతము, శ్రీరామరక్ష.
'దామాషా' పద్ధతి అంటే వణుకుతారు వీళ్లు
తమ గోచీలూడి పడకుండా-
ఫిరాయింపుల బురఖాలు తొడుక్కుంటారు
అసత్యం చెప్తూ, అసత్యంలో బ్రతుకుతున్న
అజ్ఞానులు, అధికారవ్యామోహులు
వంగి వంగి సలాములు చేసే గులాములు—వీళ్ళు
కాదా పిరికివాళ్లు ?
సరేనా ?
సరిసరి
ఇక-వాజమ్మలు
వీళ్లు అత్యంత ప్రమాదకారులు
పుస్తకాలు, పురాణాలు చదివిన వాళ్లు
పరిశోధనలూ, ప్రయోగాలు చేస్తుంటారు.
వేలకొద్దీ జీతాలూ మేస్తూ
ప్రజలకు 'హీరో' లా
'అధి'కారానికి బానిసలా
గానుగెద్దు బ్రతుకు వీళ్ళది
పత్రికల్లో-పతాక శీర్షికల్లో
శాస్త్రీయ పద్ధతుల్ని ఏ కరువుపెడ్తూ
అశాస్త్రీయంగా ఒళ్లు పెంచుకుంటూ
అనవసరంగా అస్త్ర సన్యాసం చేస్తూ
కోరుకున్న ఆఫీసులు, సొంత కట్టడాలు
లేక
ఏ విదేశ పర్యటనకో, ఏ బిరుదుబిళ్లకో
ఆశపడి-
అరలు కట్టుకుని
వాటిని దాటిరాక
సమాజనపుంసకుల్లా-వీళ్లు

తమకు తామే తగించుకున్న
బోర్డు 'మేధావులు'
వీళ్ళకు తమ దేశం సంగతి పట్టదు
కాని
అంతర్జాతీయ సమస్యలకు మాత్రం
పరిష్కార ప్రణాళికలు తయారు చేస్తారు
కోకిలగా భ్రమపడ్డ గొంతు విప్పని కాకి జాతి ఇది
"సైన్సు కాంగ్రెసు"లో భౌతిక శాస్త్రంపై సుదీర్ఘ పరిశోధనా
వ్యాసం సమర్పించి
మధ్యలో 'బాబా' విబూది నుదుట దిద్దుకుని
'బఫే' భోజనంలో కోళ్లు, రొయ్యలూ (Sweet Prauns)
మెక్కడం
ఆపై తాపీగా సోమరసం సేవించడం.
'అభ్యుదయ' సభలో దోపిడీ వర్గాలను
బూజు పట్టిన ఆచారాలను తెగడ్డం
ఇంటికొచ్చి
ఆ రోజు రావల్సిన 5 రూపాయల వడ్డీ లెక్కలు
సరిచూసు కోవడం.
'ఆకాశవాణి'కి కుల నిర్మూలనపై ఇంటర్వ్యూ యివ్వడం
ఇంట్లో అవకాశం వచ్చినప్పుడల్లా కుల సమావేశాలు జరపడం,
ఇది వీరి లాక్షణీకం.
వీళ్ల విశ్వవిద్యాలయాల్ని, ఆకాడెమీల్ని,
ఆఫీసుల్ని, స్వచ్ఛంద సంస్థల్ని, నడుపుతారు.
మనజాతికి దాపురించిన (ఆశించని) దౌర్భాగ్యులు.
పిరికి వెధవల అధికారం కోతి చేతిలో-
వాజమ్మలనే కొబ్బరికాయలు.
వాళ్లు, వీళ్లు ప్రజలకు నేర్పుతున్న సూత్రం
"మైనస్ × మైనస్ = మైనస్"
ఇందుకు నిదర్శనం
నీవూ, నేనూ వుంటున్న ఈనాటి వ్యవస్థ. *

## ఏళ్ళు

సూక్తి వెయ్యేళ్ళు
ఆయుష్షు నూరేళ్ళు
అస్తిత్వం అరవై ఏళ్ళు
నిద్ర నలభై ఏళ్ళు
నిస్తేజం పాతికేళ్ళు
ఆలోచన ఇరవై ఏళ్ళు
అజ్ఞానం అయిదేళ్ళు
అనుభవం నాలుగేళ్ళు
భక్తి మూడేళ్ళు
భుక్తి రెండేళ్ళు
కరువు ప్రతిఏడూ. *

## జ్ఞానం

అజ్ఞానాన్ని చూసి
నవ్వి అవివేకివి కాకు
అజ్ఞానాన్ని చూసి
జాలిపడి అసమర్థుడివి కాకు.
అజ్ఞానాన్ని చూసి
అసహ్యించి అహంకారివి కుకా.
జ్ఞాన సముద్రంవైపు
పరుగిడే - వదుల్నీ
ఉప నదుల్నీ,
అంతకన్నా చిన్నవాగుల్నీ,
ఎరుల్నీ
తృణీకరించకు!
ఏండ్లుగా సాగుతుంది
బ్రతుకు సత్యాన్వేషణే.
ఏండ్లుగా సాగుతుంది *

## నడక

వాడు నడుస్తాడు
ముందుకు పరుగిడే రైలు బండిలావాడు
వీడు మరొకడు
వీడు నడుస్తాడు
కాని-
వెనక్కు నడిచే రైలుబండిలా-వీడు.
వీళ్ళ నడక ఎలావుంది ? ఎక్కడకు ?
జీవితం రైలు ఇంజనుకు
అనుభవాల పెట్టెలు తగిలించుకొని
చేతలు, కూతలు పట్టాలమీద
అవకాశం ప్రతి స్టేషన్‌లో ఆగుతూ-
వీళ్ళనడక - మూటలకొరకే.
"అయ్యా ; వీళ్ళెవరు ?"
ఆర్యా ; వీళ్లు-
తొంభై శాతం తెలుగు కవుల ప్రతినిధులు. *

# అయోమయం

-రెడ్డి రాఘవయ్య

మళ్ళించినా మళ్లించకపోయినా
పల్లానికే పోతున్నాయి నీళ్ళు
జల్లించినా జల్లించకపోయినా
బియ్యంతో చెలిమిచేస్తున్నాయి రాళ్లు
అవసరమున్నా లేకున్నా
పెరుగుతోంది, ఎగురుతోంది విజ్ఞానం
తెలిసినా, తెలియకపోయినా
తరుగుతోంది, పెరుగుతోంది అజ్ఞానం
తీరినా, తీరకపోయినా
పెరుగుతున్నాయి, కరుగుతున్నాయి కోర్కెలు
తిన్నా తినకపోయినా
తిరుగుతోంది జరుగుతోంది కాలం
కొన్నా కొనకపోయినా
పెరుగుతున్నాయి, పరుగెడుతున్నాయి ధరలు
ప్రాచీనతకు అడపాదడపా
ప్రతిచోటా అవమానం జరుగుతోంది...
అహానికీ ధనదాహానికీ అంగలేసేవాళ్లు
అందంగా కడుతున్నారు ప్రగతికి గోరీలు
అలసత్వానికీ, దాసత్వానికీ దాసులైనవాళ్లు
నిత్యం ప్రగతికి జై కొడుతూనే ఉన్నారు...
ద్వేషం పిశాచాలు మోసం వేషంవేసుకొని
ఆడుతున్నాయి ఆసహ్యారంగస్థలంమీద
ప్రేమా సౌభ్రాత్రం 'సహనం' ముసుగేసుకొని
చల్లగా అసత్యపు నీడల్లో కళ్ళు తుడుచుకొంటున్నాయి

నిజానికి నిజంగానే నిలువ నీడలేదు...
ఇంక ముందొస్తుందన్న ఆశ అసలే లేదు
జరుగుతుందనుకున్నది జరక్కుండానే
జరిగిపోతోంది చల్లగా కాలం...
తన్ను తాను తెలుసుకోలేనివాడు
నన్ను జూచి కన్ను నిత్యం పొడుచుకుంటున్నాడు.
రోళ్ల పగులగొట్టే రోహిణీకార్తెలోని
మిట్ట మధ్యాహ్నం సూర్యుడిలా మండే దౌర్జన్యాన్ని
ఆశలచేయి చాటు చేసుకొని
అవలోకిస్తున్నాడు సద్భావం తమ్ముడు
లోకంతీరు చూస్తుంటే
నాకు అయోమయమైపోతున్నది...
నేనూ ఒక మనిషి ననుకుంటే
నా శిరం సిగ్గుతో వంచుకోవాల్సివస్తున్నది...*

# ఏకతా దీపం

బ్రతుకుపైన ఎనలేని ఆశ
ప్రతి మనిషిలో స్వార్థం పెంచుతుంది...
అధికమైన స్వార్థమే
హృదయంలో అహం పెంచుతుంది—
స్వార్థమే ప్రతిదానికీ దూరంచేసి, బ్రతుకు
వ్యర్థమయేలా చేస్తుంది
అందమైన నీ హృదయాన్ని స్వార్థానికి
ఇంధనంగా ఉపయోగించకు
అత్యాశకుపోయి అహాన్ని పెంచుకొని
నిత్యం నీవు ఒంటరివి కాకు...
ఒంటరిగా దడిగట్టుకోకు ఎదలో
మంటలు రేగేను
వెంట వచ్చే మంచిని కాదనకు,

బ్రతుకుపంటలు పాడయేను...
పండంటి బ్రతుకును
బండరాయిగా మార్చకు
పదుగురితో కలసి ఉంటేనే
పదును దేనికైనా...
అందర్నీ ఒదలి ఒంటరివై
అంధకారంలో పడి బ్రుగ్గకు
మానవతా ధర్మాన్ని మరచి
దానవుడివై క్రుంగకు...
మంచే మనిషికి కొండంత అండ
మంచి ఉన్న మనసెప్పుడూ కాదొక బండ
నిన్ను జూచినట్లు నీతోటివారిని చూచినపుడే
ఎన్నరాని ఆనందం నిన్ను వరిస్తుంది
అనవరతం నీ హృదయంలో
ఆనందం వెల్లువలై ప్రవహించాలంటే
మమతా తైలం నింపుకో
ప్రేమ జ్యోతిని వెలిగించు
నిన్ను ఆవరించుకొన్న స్వార్థం చీకటి
నిన్ను విడిచి దూరంగా పోతుంది
దానత్వం దానిదారి వెతుక్కొని
మానవత్వం నిశ్చలంగా నిలుస్తుంది...
ఎండిపోయే నీ ఎడదలో
పండు వెన్నెల కాస్తుంది
మండిపోయే నీ బ్రతుక్కి
నిండుదనం వస్తుంది... *

# సాగని పయనం

అంతు చిక్కని దానికోసం ఆలోచిస్తున్నది మనస్సు
అరుణ కాంతివైపు పరుగెడుతున్నది వయస్సు

ఎంతకీ ముందుకు సాగటంలేదు ఈ యాత్ర
గొంతులోనే అడ్డుకున్నది వేసుకొన్న మాత్ర

ప్రతి వ్యక్తికీ తానెలా బ్రతకాలో తెలుసు
అందుకే లోకులంటే చూపుతాడెంతో అలుసు
కలగా పులగంగా ఉంటే బావుంటుంది లోకం
అప్పుడే అవుతుంది లోకమే ఒక నాకం

ప్రతి మనిషీ చూసుకుంటున్నాడేదో దారి
నేనూ వెతుకుతున్నా కాలంతో పోరి
జీవితం నన్ను చేస్తున్నది ధోకా
నాకు నేనే పట్టుకోవాల్సివస్తున్నది కాకా

బాగా పూస్తున్నది మాయింటిముందు లత
ముందు ముందేలాగున్నదో తెలియదు దాని రాత
చీకటి తరువాత వెలుగొస్తుందని భ్రాంతి
మందంగా కాస్తున్నది రాత్రి వెన్నెల కాంతి...

ముందు ముందు వెలుగుకోసం చూద్దాం
మనస్సమాధానానికి ఏదో ఒకటి చేద్దాం
ఆశలయితే ఉన్నాయ్ అందంగా
నా నడక సాగుతున్నది మందంగా

దార్లో రాళ్ల రప్పలూ నడక సాగటం కష్టం
కష్ట సుఖాల్ని భేరీజు వేసుకుంటే నాకే నష్టం
ఎవరికీ తెలియటంలేదు ఈనాటి పైనం
ముందు ముందేలా సాగుతుందోమరి ఈ పయనం... *

# చలానికో నివాళి

—"ఆరా"

ఈ సంఘం సంస్కారం సందుల్లో
సంసారులు సానులౌతున్నప్పుడు;
చీకట్లలోనూ, చిరిగిన దుప్పట్లక్రింద
నాల్గు గోడల మధ్య, కుక్కిమంచం మీద
శృంగారం నలిగి మూలుగుతున్నప్పుడు ;
కామానికి ప్రేమకి భేదం తెలియక
సౌందర్యానికి మడి బట్టలు చుట్టినపుడు ;
స్త్రీజాతి విడిచిన ఊపిరినుండి
పుట్టిన ఓ తపస్వీ !
బళ్ళో ఉండాల్సిన బడిపంతులివి,
బడినుంచీ, మడినుంచీ
సంఘం నుంచీ, దాని సూత్రాలనుంచీ
విడివడి వేడిద్రవం విరజిమ్మావు
మనిషి
తాను చేస్తూ చెప్పలేని పనులు
నీ నోటపలుకులైప్పుడు
నమ్మలేని నిజాలను
నలుగురికీ చెప్పినపుడు ;
గడపలోపలి సౌందర్యాన్ని
'మైదానం'లోకి రమ్మన్నపుడు ;
మూఢాచారులు ముక్కుముడిచారు ;
భరించలేని సంఘం భగ్గుమంది.
ఏ ఇజాల చట్రాలలోను ఇరకవు నువ్వు
నిజం నిప్పులోని సెగవు నువ్వు
నీరాతల్లో బూతునే
చదువుతున్న జనాన్ని
ఒక దాస్యం నుంచి మరొక
దాస్యానికి బలి అవుతున్న
వనితను చూసి చెమర్చిన నీ కళ్ళు
చూపుతున్నాయి ఈ సంఘంలోని కుళ్ళు
అరుణాచలంలో ఈశ్వరున్ని చూస్తే

పిరికివాడు పరుగెత్తాడందీ సంఘం
అది ఒక క్రొత్త సత్యమని
అదే నీలో నిత్యనూతనమని
ఎందరికి తెలుసు ?
నువ్వు ఈ జగాన రేపిన ఉప్పెన
మళ్ళీ రాదు ఇప్పుడప్పుడే
కళ తత్త్వం మార్పు
నీ తత్త్వమూ మార్పే
అందుకో ఈ నివాళి
మౌన హృదయ రాగావళి*

## మానవుడు

పుట్టిన క్షణాన ఈ ప్రపంచం గాలి పీల్చి
పీల్చిన తక్షణం 'కేర్' మని ఏడ్చిన
ఆ ఏడ్పే తన జీవితం మీద పెత్తనం చేస్తుందని
ఆ పుట్టిన పసివానికేం తెల్సు పాపం !
పసితనంలో పాలతో
పెరిగిన తర్వాత పణంతో
మోసాన్ని పెంచుకుంటూ
స్వార్థాన్నిఆహ్వానిస్తూ
భగవంతుణ్ణి నమ్మి ఆస్తికుడై
ఆస్తుల సంపాదనతో నాస్తికుడై
కనిపించేదంతా మాయేనని తెలిసి
కనపడనిదానికోసం తపన దేనికని
తనను తాను వంచించుకుంటూ
తనువు నడిపిస్తాడు
ఎముకలు కుళ్ళిన తర్వాత
చర్మం నలిగిన తర్వాత
వెనక్కి చూస్తే ఏం ప్రయోజనం ?
దేవుణ్ణి కొలిస్తే ఏం లాభం ?
క్రుంగి కృశించిన శరీరం
నశించి సమభూమి కెక్తుందన్నది సత్యం
కాలే కట్టెలు సణుగుతుంటాయి
మండే మంటలు పలుకుతుంటాయి

బూడిదయేవరకు ఒకటే గుసగుసలు
"ఈ మానవు డెందుకు పుట్టాడు ?" *

## నీ కోసం

కలకి కథవై
ఊహకి ఊసువై
కవితకు నడతవై
హృదయానికి స్పందనవై
కనబడక కదలాడే నీకై
వెదికి వెదికి వ్యథ చెందా
మల్లెల మత్తులో
గజ్జెల సవ్వడిలో
ప్రియురాలి పెదవి ఇంపులో
వగలాడి వలపు సొంపులో
నిన్ను చూసిన నేను
సొంతం చేసుకుందామనుకున్నా

వెన్నెల చల్లదనం
గుండెల వెచ్చదనం
పచ్చిక పచ్చదనం
అంతా నీ సొంతధనం
దొంగనై దొంగిలించలేను
ప్రకృతినై పరవశించలేను
కవినై కలవరిస్తా
భువిపై ఎదురు చూస్తా
నీ అనుభం కోసం! నీ కోసం!! *

## స్త్రీల సంబరం

(అంతర్జాతీయ మహిళా దశాబ్దం సందర్భంగా)
పది సంవత్సరాల పండుగ పందిళ్ళలో
పట్టు చీరల మడతల చప్పుళ్ళు;
కొప్పులు, కళ్ళజోళ్ళు కలయతిరుగుతున్నాయ్
''వేనిటీ బాగ్‌లు'' వేగిరపడుతున్నాయ్
మంత్రిణిగారొస్తారు
సమస్యల్ని ఊదేస్తారు

పోదాం పోదాం ఇళ్ళకి
పన్నుల్ని ఒదిలేద్దాం చెల్లెళ్ళకి:
ఇదే సంబరం - ఇదే ఆడంబరం
నలిపేస్తోంది నాగరికలో కాస్సి
కూలీ నాలీ చేసే కూలి పడుచులు
గుడిసెల్లోని గంజినీళ్ళ పడతులు
నిరక్షర నారీమణులు;
అరిగిపోతున్న అమ్ముడుపోయిన ఆడది
అణిగిపోతున్న అబలల ఆక్రందనలు;
అనవసరమయ్యాయి సభ్య స్త్రీలకు;
ఆ సోదరీమణుల వ్రణాలు
స్త్రీ జాతికి అవమాన క్షణాలు;
కట్నంలేక కరువౌతున్న సుఖం
ఆవిరై పోతున్నది దుఃఖం;
వనితకు వనితే సవితౌతున్నప్పుడు
సమస్యలకు ఆహుతి తప్పదు;
క్లబ్బుల్నుండి, పబ్బుల్నుండి
సరదాల్నుండి, పరదాల్నుండి
బయటకురాని వనితలు
సభలకు ఆహూతులు;
మండలులకు, దండలకు
కాలక్షేపాలకు, ఆక్షేపణలకు
అంకితమయ్యే అమ్మలు
ఈ సంబరాలకు బొమ్మలు
కళ్ళు తెరవండి, కదలిరారండి
కరుణామయ కాంతలారా
ప్రపంచంలోని ప్రతి స్త్రీని
మీ జాతి సభ్యురాలుగా గుర్తించండి
గుర్తించి మీవిధిని నిర్వర్తించండి.
పారద్రోలండి పాడు చీకట్లను;
పది సంవత్సరాల పండుగలో
దండుగ మాని నిండుగ ఉండండి:
మా అండ మీ కుండ
నడవండి ఆగకుండ.

## గ్రహణం    పి.స్.ఎ.ఎస్. శర్మ

మనిషిలోని
మత మౌఢ్యానికి
విజ్ఞాన సౌష్ఠవానికి
అద్దం పట్టిన చిత్రం
కర్ఫ్యూ విధించినా
అదుపు కాని జనసంచారం
కడప దాటని వైనం
సంప్రదాయాల సంకెళ్ళు
తలుపులవెనుక వెంకన్న
భయాల గూళ్ళలో
అనుమానాల బందీలై
అపూర్వ అమర ఆనందాన్ని
చే చేతుల జారవిడచినప్పుడు
రాత్రివేళ నెమ్మదిగా మరులు కలిగించి
మరులు కల్గించి
దయగా - ప్రేమగా
వెన్నెలకురిసే
చందమామ వెనుక
కర్మసాక్షి నక్కిన తీరు,
జగతిని ఆనందవాహినిలో
ముంచెత్తిన సౌరు
పట్టపగలే నేలమీద
నీలి నీడల చాటున
సర్వజీవకోటి జీవనదాత దోబూచులాట
కర్మసాక్షి రంగుల దృశ్యకావ్యం
కర్మభూమి భారతావని
ప్రముఖరంగస్థలమైన ఘట్టం
ఖగోళ మండలంలోని పరివర్తనం
ఖగజాలంపై చూసిన వింత ప్రభావం
చీకటి పడిందని
తమ నెలవులకు తిరోగమిస్తున్న జంతుతతి-
తెల్లవారిందని
అకాలంలో కూతలుపెట్టిన కోళ్ళు !
గుడ్లువచ్చి పిల్లను పెక్కిరించిన చందాన ఉంది

సూర్యుని ముందు కురికిన
చందమామ దురాక్రమణ.
వినీలాకాశంలో
తళుకులీను చుక్క వెన్నెల
అపూర్వ రవ్వల వలయంలో
సౌర సౌందర్య శోభ
రోదసీ కుహరంలో
మిలమిల మెరసిన శుక్ర బుధులు
అది వెన్నెలా
నియాన్ లైట్ల వెలుగులపోలు
కాంతిచక్రంలో నల్లని గుండ్రని మచ్చ
చక్కని పసిడి వెన్నెలగల
కన్నెకు కాటోలు బ్యూటీస్పాట్!
దేశ విదేశాల
ఖగోళ శాస్త్రవేత్తల సమ్మేళనం
దేవ దేవతల
పూజాస్తోత్ర పాఠాల సంరంభం
తమస్సు చీలుస్తూ
మానవాళి క్రాంతిగమనం
విజ్ఞాన జ్యోతుల
ప్రగతి పథంవైపు పయనం!
గగనంలో గ్రహణం
ఒక్కొక్కరికి ఒక్కొక్క తీరుతోచె,
మంత్రాలు చదివే సుబ్బావధానులకు
చీకటిలో దేవతల బలం తగ్గి
దానవుల బలం ఇనుమడించి
సూర్యబింబాన్ని కబళించే
రాహువు కనిపించె;
జ్యోతిష్కులకు
భవిష్యత్తులో విపత్తులు అనర్థాలు అగుపించె;
తాంత్రికుల తాయెత్తులకు
రాజయోగం పట్టింది;
విజ్ఞాన శాస్త్రవేత్తలకు
విశ్వాంతర రహస్యాలెన్నో స్ఫురించె

గృహిణులకు అంగడి సరకులన్నీ
రాహువు పుక్కిట నున్నట్లు అగుపించె
రాజకీయ కురు వృద్ధులకు
ప్రజాసామ్య యాజ్ఞ సేని
దుశ్శాసన కేశగ్రహణంలా కనిపించె
చెట్ల ఆకుల సందునుంచి
వాలిన ఎండ పొడ
నేలకు రాలిన చంద్రుని శకలంలా
చండాంశుని రాకచే
చంద్రబింబం కరిగి ఇలకు ప్రవహించినట్లు
సూర్యుడు సమస్త జీవులకు తా
నొక్కడై తోచే! *

# పరిశీలనం

హృదయం -
ఒక ధనం
హృదయం -
ఒక కవనం
హృదయం -
ఒక గగనం
హృదయం -
ఒక జీవనం
బ్రతుకు -
ఆటు పోటుల మయం
బ్రతుకు -
ఆశ నిరాశల నిలయం
బ్రతుకు -
చీకటి వెలుగుల వలయం
బ్రతుకు -
ఆర్ద్రిత అనురాగాల ఆలయం! *

# శాంతి దూత

ఆమె మూర్తీభవించిన మానవత!
దీనులకోసం ద్రవించి స్రవించిన మమత-
ఆ కరుణామయి సేవతో పులకించింది భారతమాత.

ఆకలిమంటలు చల్లార్చ సేవాదీక్ష పూనిన శాంతిదేవత
యుగోస్లావియాలో పుట్టింది
భారతావని ఆమె రాకతో పరిమళించిందిం
ఆరు దశాబ్దులుగా-
పసిపాపల బోసినవ్వుల నందనానికి తోటమాలిగా-
దీన జీవన వనంలో ఆనంద పుష్పాలు పూయించి
అమృత ఫలాలు పండించి-
మానవసేవే మాధవసేవగా
వెలుగొందిన అమ్మ థెరసాకు చంద్రునికో నూలుపోగు
ఆమెకు శాంతి బహుమతి ప్రదానం
మానవతకే సన్మానం *

# కవితా కన్యక

కవి హృది తరగని రస ఖని
అందు జనించిన కవితాకన్య అయోనిజ
గంతులువేస్తూ, నాట్యం చేస్తూ
మబ్బుల తేలియాడు చంద్రునిలా
తెల్లని చంద్రికల వృష్టిలో
కరగుచున్న తగరపు కళాయి పూతల
జగతికి రుద్దుతున్నది
ఈమె నిజంగా కొమ్మయేనా ? లేక బొమ్మయేనా ?
తీవ వంటి మేనుతో-నవ్వుల పువ్వులతో-
వలరాజు తోటవలె సౌందర్య సామ్రాజ్ఞివలె
దరహాసం సుమశరుని నారీటంకారంగా
మందహాసం మదనుని చంద్రహాసంగా
గంగాతరంగాలై జాలువార
చివురుల మధ్య విరులు విచ్చినట్లు
వాలు జూపుల తూపులట్లు
ప్రణయ సూత్రమట్లు-ప్రేమ భాష్యాలట్లు
చినుకు వానకు చీకటి కోనకు
భీతిల్లని ఈమె ఎవరు ?

# చుక్కలు

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

మచ్చలేని మహాత్ముని
మాటలను
బుద్ధిగా వింటున్న
ఖద్దరుటోపీలు...చుక్కలు...

నమ్ముకున్న నాయకుణ్ని
ఓట్లతో గెలిపించి
పాట్లుపడుతూనే ఉన్న
దిక్కులేని ఒక్క వోటర్లు...చుక్కలు...

చారెడు చదువైనా రాని
సంప్రదాయం వదలుకోని
పదేపదే చెప్పే కుటుంబసంక్షేమం
పాఠాలేమీ వినని
కన్నపిల్లలకు
కలోగంజో కూడా పోయలేని
ఆదికాలంనాటి
వేదకాలంనాటి
పేదరాలు - 'చంద్రవ్వ'
కడుపునిండా కనుక్కున్న
గంపెడు సంతానం...చుక్కలు...

ఒక్క ఉద్యోగంకోసం వచ్చిన
లెక్కలేని దరఖాస్తులు...చుక్కలు...

అగ్రశ్రేణికి చెందిన
అందాల అభినేత్రికి
ఆబాల గోపాలన్ని
ఆకట్టుకున్న కళామూర్తికి
గగనమనే రాజధానీ నగరంలో
ఘనంగా ఏర్పాటు చేసిన
అభినందన సభకు
అన్ని ప్రాంతాలనుండి
అరుదెంచిన
అసంఖ్యాక రసికవరులు - చుక్కలు...

సౌందర్యామృతాన్ని ఒలికించే
చంద్రవదనను చూసి
చేపట్టాలని విచ్చేసి
తీరా వరకట్నం లేదనగానే
తెల్లమొగం వేసిన
తెలివి తక్కువ వాళ్ళు - చుక్కలు...*

# ప్రగతి అంటే ?

ప్రగతి అంటే ?–
ముల్లులా దూరి నొప్పించడం కాదు
పువ్వులా విరిసి మెప్పించడం.
సరస్సులా స్థావరం కాదు
సరిత్తులా పరుగెత్తడం.
నదీ నాయికలు సముద్రుని
ఎదలో ఒదుగడం కాదు
జలాలు పొలాలతో
గళాలు కలపడం.
నీళ్ల ఒళ్లు నిమురడం కాదు
నిప్పు ముడులు విప్పడం.
సుమంలా శరీరం
సుతిమెత్తగా ఉన్నా
సంకల్పం 'ప్లాటినం'తో
సరితూగడం.
గుట్టలా నిలిచిపోవడం కాదు
చెట్టులా అణువణువూ ఎదుగడం
బాకుల్లా ప్రాణం తీయడం కాదు
ఆకుల్లా నీడనివ్వడం.
కీకారణ్యంలా భీకరంకాదు
నందనంలా సుందరం
పక్షాలతో ఎగురడం కాదు
పాదాలతో నడవడం
అది-
శిలకాదు
శిల్పం;

మొగ్గకాదు
పుష్పం;
భ్రమకాదు
శ్రమ;
సవ్వడి కాదు
సర్వం;
ఛందం కాదు
సత్కవిత్వం
ఆకాశం దాని ఎత్తు
ప్రకాశం దాని సొత్తు
అదీ ప్రగతి
అదే మనకు సదాగతి*

## కొస మెరుపుల

లక్షధనం దేవుడికై ఇచ్చేవాళ్లూ
అచ్చంగా ప్రాణాలే ఇచ్చేవాళ్ళూ
ఉంటారీ గుడిలోనే అంతేకాదూ
చెప్పులు కొట్టేద్దామని వచ్చేవాళ్లూ...

గుడులకు దూరాన సాగు చెడుపని పాపం
గుడి సన్నిధిలోనైతే కాదని పాపం
అందుకనే చేరతారు ఈ దేశంలో
గుడిదాపున వేలకొలది వేశ్యలు పాపం!

ఈశ భక్తి గొప్పదనీ చెప్పినవాళ్లూ
దేశభక్తి గొప్పదనీ చెప్పిన వాళ్ళూ
పోయినారు-ఇంకిప్పుడు ఎవరున్నారు ?
పదవీ భక్తియె గొప్పని చెప్పేవాళ్ళూ.

దొంగలకు రకరకాల శిక్షలున్నవి
హంతలకూ భిన్నమరణ శిక్షలున్నవి
న్యాయానికి స్థానమైన నా దేశంలో
తుచ్ఛలైన నాయకులకు శిక్షలు ఏవీ ?

ధనంకన్న గుణం మిన్న - పుస్తకాలలో
గుణం కన్న ధనం మిన్న - మస్తకాలలో
అందుకోసమే నేడీ మన సంఘంలో
వరకట్నం మాట గెలిచె మస్తకాలలో

ఆడది అబలని ఎపుడూ అనుకోబోకూ
కలనైనా చూపించకు విసుగు పరాకూ
సినీమాల క్యూలో నిలబడి చస్తుంటే
ఇక్కట్టూ లేక తెచ్చు టిక్కటు నీకూ.

టిక్కట్టూ దొరుకువరకు పార్టీదైవం
ఓట్లు పడేదాక పేదప్రజలే దైవం
ఎన్నికలో గెలిచి పదవి వచ్చిందంటే
నాయకునికి ప్రజలంతా భూతం దయ్యం.

కవులల్లో ఉన్నారూ 'కరుణశ్రీ'లూ
కష్టపడి వ్రాశారూ 'ఉదయశ్రీ'లూ
కష్టపడక తెస్తారూ మన నాయకులూ
పార్టీలను మార్చుటలో 'పద్మశ్రీ'లూ.

ఆకాశంలోన పుట్టె ఒకడు అర్కుడూ
అవనిపైన ఒకడు పుట్టె విక్రమార్కుడూ
వెలిశారూ ఈనాడూ వేలకువేలూ
అసలురంగు బైటపడని అక్రమార్కులూ

ప్రతి గిరిలో సెలయేరూ ఉదయించాలీ
ప్రతి ఝరిలో విద్యుత్తులు ఉదయించాలీ
విద్యుత్తును ప్రతి చీకటి వాకిటిలోకి
ఉరికించే మహాత్ములే ఉదయించాలీ.

నరులలోన రాక్షసులూ ఉన్నారిపుడూ
రెండు కాళ్ళ మత్తేభాలున్నవి ఇపుడూ
నరరాక్షసులను కరులను నాశంచేసే
నరసింహులుగా నరులే లేవాలిపుడూ. *

# తేజస్సు

వి. వి. ఎస్. ఎన్. అడపాల

ఎన్ని వందల, వేల, లక్షల మిణుగురులైతేనేం ?
మింగలేవు నక్షత్రాల కాంతిని
ఎన్ని. వేల, లక్షల, కోట్ల దివిటీలైతేనేం ?
అది గమించలేవు సూర్యకాంతిని.
మేం నడిపించే నాటకంలో
పాత్ర ధారులు
నిలకడలేని మిణుగురులు కాదు
నిశ్చలంగా వెలిగే నక్షత్రాలు
మా నాటకానికి వెలుగిచ్చేది
వెలిగి ఆరిపోయే దివిటీలు కాదు
అఖండంగా వెలిగే ప్రచండ భానుడి తేజస్సు.*

# మరో ప్రపంచానికి ప్రయాణం

నేను మనిషిని.
కేవలం - అణాకానీలకు
తేలిగ్గా అమ్ముడుపోయే
అర్థం పర్థంలేని మనిషిని
కాను - కాబోను.
ఓ పరమార్థాన్ని
నా నరాల్లో బిగించుకుని
ఓ పట్టుదలను
నా రక్తంలో రంగరించుకుని
ప్రగతి పథం వైపు
ప్రవాహంలా-పరుగెత్తుతున్నవాణ్ణి
పడమటి గోదావరి చిన్నవాణ్ణి,
గుండె గుండెను ప్రేమగా మీటుతూ
కొండలనైనా మొండిగా ఢీకొడుతూ
బండల్ని సైతం మంచులా కరిగిస్తూ
చీకట్లలో చిరువెన్నెలలు పూయిస్తూ
గ్రీష్మంలో చల్లదనాలను సృష్టిస్తూ
నీలిమేఘాల మత్తగజం అధిరోహించి
గాలికెరటాల ఒడుపుల్లోంచి

చూసుకుపోతున్న నేను
మనిషికి మనీషికి కూడా
పదహారణాల నిర్వచనాన్ని
ఎందరో ఎందరెందరో
మహాత్ముల వెలలేని కలలకు
ప్రతిబింబమయిన
మరో ప్రపంచానికి నా ప్రయాణం.
నే పాదంమోపే ప్రపంచంలో
మనిషిని స్వరూపాన్ని బట్టి కాదు
స్వభావాన్ని బట్టి ఎంచుతారు.
అక్కడ బీదవారు గొప్పవాళ్ళు
'హల్లో' అంటే 'హల్లో' అనుకుంటూ
ఒక పందిరికింద విందు చేసుకుంటారు.
అక్కడ 'కులం'-'మతం'-పిండాకూడు
అంటూ అరిచి గీ పెట్టేవాళ్ళను
నిష్కర్షగా వేలిస్తారు
మూడంకె వేయిస్తారు.
కరెక్టుగా
ఉపమిస్తే
కుళ్ళు మామిడిపండుకన్నా
హీనంగా చూస్తారు.
అక్కడ పొంగే నదుల్లో
మానవత్వం పాలే ఎక్కువ
అక్కడ కోయిలలు
సొంత గొంతుల్లో సొంతపాటలే పాడతాయ్
అక్కడ గులాబీకి ముళ్ళు మొలవవ్వు
అక్కడి ఆడవారిని దేవతల్లే ఆరాధించుతారు
అక్కడ విద్యాలయాలనే కాదు
ఏ ఆలయాన చూడు
క్రమశిక్షణ మయూరంలా నర్తిస్తుంది.
నేనన్న వాటికి చప్పట్లు కొట్టి
ఆపై చేతులు ముడిచి
ఆపై ఊరుకోకండి
రండి-నా హృదయం తెరుస్తున్నాను

దాన్ని పుష్పకం చేస్తున్నాను
వచ్చేటోళ్ళు పనికొచ్చేటోళ్ళు ఎక్కండి.
అందరం అన్నిచేతులు వేసి
ఇన్నాళ్ళూ-స్వప్నలబ్ధ పదార్థంలా
చేతికందని స్వర్గంలా
ఎక్కడో దూరదూరంగా ఉన్న
మరో ప్రపంచ మహా పర్వతాన్ని
కోట్లాది భుజాలతో మోసుకొద్దాం
ఎడారిలా ఉన్న ఈ ప్రపంచాన్ని
ఒక నందనవనిని
ఒక బృందావనిని-
చేద్దాం - చేసి తీరదాం !!*

## ప్రబోధ గీతం

నడు నడవోయ్-
నవయువకా
సుందర తీరాలవైపు
నడపవోయ్-దేశనౌక.
మన దేశనౌక.
మన దేశం- మన సంస్కృతి
ప్రపంచాన మేలైనది
పరదేశీ వ్యామోహం
మనకెందుకు వదవోయీ.
మన జాతికి మచ్చదెచ్చు
పని ఎన్నడు చేయకోయ్
ఎవడైనా చేసినపుడు
చూసి వదలివేయకోయ్.
కూడు గుడ్డ లేనివాళ్ళ
గోడు వినేవాడు లేడు
దారిద్రపు భారతాన్ని
దరిచేర్చగ సాగవోయ్,

## నేను మృత్యుంజయుణ్ణి

నా జీవితం ఒక విషాద వీణగా
అంధకారంతో తగలడిపోయే
అమావాస్య నిశిలా
వెలవెలబోతున్నా భయంలేదు నాకు.
నాలోని శక్తినీ యుక్తినీ ఏకం చేసి
వికటించిన నా వీణను సరిచేసిన రోజున
సుమధుర సంగీత పరిమళాలు
దిగంతాల అంచులదాకా ప్రవహిస్తాయ్.
నాలోని విశ్వాసాన్ని
కత్తిగా మలచి
అమవాస కడుపులో-
అమాంతం పొడిచినప్పుడు
వెలుగు వెల్లువయి
ఆకాశం నెత్తిదాకా పొంగుతుంది.
ఇన్నిన్ని ముళ్ళకంపల మధ్య
అన్నన్ని కఠిన పరిస్థితుల మధ్య
ఎన్నెన్నో ఎగుడు దిగుడులమధ్య
నీ మాటెంతవరకు
ఊపిరి పీల్చుకుంటుందని-
ప్రశ్నించే అమాయక చక్రవర్తులకు
తెలీదు పాపం-
నేను మృత్యువును మింగి బతుకుతున్నానని !!

## మృత్యు వలయాలు

గ్లాసులకొద్దీ స్వార్థాన్ని సారాలా తాగి తాగి
చీకటి కాంతను కావలించుకుంటున్నాడు మానవుడు
వెలు గిల్లాలికి విడాకులిస్తూ-
నరనరంలోనూ 'క్రౌర్యం' రక్తాన్ని నింపుకుని
ఆటం హైడ్రోజన్‌లతో చీట్ల పేకలాడుకుంటున్నాడు
శాంతి జీవనానికి ఉద్వాసన చెప్తూ-
మనిషి మనిషికీ మధ్య అంతరాల అగాధాల్ని సృష్టించి
కులమతాల కూపంలో కప్పలా పరిభ్రమిస్తున్నాడు
ఇవన్నీ మనిషి తనకి తను సృష్టించుకున్న
మృత్యు వలయాలు
ప్రగతి రథాగమనానికి ప్రతిబంధకాలు.

# జాగృతి

ఎమ్. సూర్యనారాయణ

లేవండి లేవండి యువకుల్లారా !
నిద్రనుండి
అజ్ఞానం నుండి,
అవివేకంనుండి.
దివ్యజ్యోతివైపు
ప్రగతి పథంలో పయనించండి
స్వార్థానికి వాడుకొనే నాయకుల
పన్నాగాలను వమ్ము చేయండి
అన్యాయాలకు, అక్రమాలకు పాల్పడే
వినాయకులకు బుద్ధిచెప్పండి.
గాంధీజీ చెప్పిన అహింసా మార్గాన
నెహ్రూజీ పరచిన సమతామార్గాన
అన్యాయాలను అక్రమాలను వ్యతిరేకిస్తూ-
సాగించండి సమతా ఉద్యమాన్ని,
రక్షించండి పౌరుల హక్కుల్ని
స్వార్థపూరిత శక్తులపై ఎత్తండి ధ్వజం
న్యాయం కోసం పోరాడండి
నీతినియమాలను పునరుద్ధరించండి
స్వార్థపరులపై సమరం సాగించండి
సస్యశ్యామల భారతావనిని నెలకొల్పండి.
అశోకునికి అక్బరుకు
శివాజీకి గాంధీకి
నిజమైన వారసులమని
నిరూపించండి
సంఘంకోసం, పాటుపడని బ్రతుకు
పాడుబ్రతుకని గ్రహించండి. *

# ఉద్యమిస్తాను!

ఏమిటి చూస్తున్నావు అలా !
నీ బ్రతుకు ఎడారి బ్రతుకైందని అనా !
నీ కష్టాన్ని దోచుకొనేవారే గాని
నిన్ను చూసి జాలిపడేవారే లేరనా !
ఏమిటి ఆలోచిస్తున్నావు ?

ఎందుకిలా బీదవానిగా పుట్టాననా !
ధనవంతుని కుక్కగా పుట్టినా,
వేళకు పాలు, బిస్కెట్లు దొరికేవనా ?
ఏమిటలా దిగులుగా ఉన్నావు ?
కష్టించినంతకాలం జలగల్లా పీల్చి
కష్టించలేనప్పుడు నీ దిక్కెవరు చూడడం లేదనా !
ఈ లోకం అంతే
ప్రతివాడు దోచుకొనేవాడే
ఉన్నవాడు మేడలపై మేడలు కడ్తుంటే
లేనివాడు రోజురోజుకూ
బక్కచిక్కి శల్యమైపోతున్నాడు.
ఎంత దారుణం
ఈ అన్యాయానికి అంతేలెదా !
కలవాళ్ళు లేనివాళ్ళు అనే భేదం
రూపు మాపుటకోసం
ఉద్యమిస్తాను ! *

## బావి–భావి

అది ఊరి చివర
మాలపల్లి ! !
నీళ్ళకోసం పోవాలి రెండు మైళ్ళు,
నాయకులకు ఎన్ని విన్నపాలు చేసినా
ఎన్ని మొక్కుబడులు చెల్లించినా,
రాలేదు బావి.
ఆ రోజు
మంత్రిగారి ఎన్నికల ప్రచారం.
మాలపల్లిలో బావి లేకపోవుట
చాలా చింతించవలసిన విషయం అనీ
తాను చాలా బాధపడుతున్నాననీ
చేశారు శంకుస్థాపన వెంటనే ఓ బావికి,
మంత్రిగారి ఔదార్యాన్ని చూసి
చాలా సంతోషించారు ఆ ప్రజలు.
పండుగ జరుపుకున్నారు
రేపోమాపో బావి వస్తుందనీ

తమ కష్టాలు తీరబోతున్నాయనీ.
ఎన్నికలు అయిపోయాయి,
మంత్రిగారి పార్టీ గద్దె ఎక్కింది,
నెల గడిచింది...ఏడు గడిచింది...
పాపం ప్రజలు మరిచారు బావి సంగతి.
బావికోసం కేటాయించిన
ఆవరణలో మాత్రం
లేచాయి గడ్డివాములు
ఆ వూరి భూస్వామివి. *

## తెలియదా నీకు ?

కొత్తగా వేసిన రోడ్లు
రాజ మార్గాల్లా ఉన్నాయి.
ఇంద్రభవనాన్నే మరపించే
రంగురంగు దీపాల భవనాలు-
స్వర్గంలా ఉన్న ఈ నగరాన్ని చూసి గర్వపడుతున్నావా !
వీధి వీధినా ఒక వినోదకార్యక్రమం,
వాడ వాడనా ఓ నృత్యనాటకం,
కళాకారుల పట్ల ఎన్నడూ చూపని ఆదరణ,
రాయలు, కాకతీయుల కాలాన్ని
గుర్తు తెస్తున్న నీ నగరాన్ని చూసి మురిసిపోతున్నావా !
ఇది మూణ్ణాళ్ళ ముచ్చటనీ,
రెండురోజులుపోతే ఈ రోడ్లు మామూలేనని,
కళాకారుల్ని, వీధుల్ని పట్టించుకొనేవారుండరనీ,
తెలియదా నీకు !
ప్రజలు చెమటోడ్చి కష్టించి ఇచ్చింది
వినాయకుల ఇనప పెట్టెలకు
పెత్తందార్ల జల్సా ఖర్చులకు అని
తెలియదా నీకు !!*

## చేరేదెప్పుడో ?

అచ్చట పువ్వులు పరిమళిస్తున్నాయ్,
ఫలాలు నోరూరిస్తున్నాయ్,
పంచభక్ష్య పరమాన్నాలు లభిస్తున్నాయ్,
సుఖాలు ఊయల లూపుతున్నాయ్,

అక్కడ సోమరులు లేరు రాజకీయ (వి) నాయకులు లేరు
రావణుల, నరకాసురుల జాడలేదు అది సుందర ప్రదేశం,
అది సస్యశ్యామల ప్రదేశం, శాంతికి నిలయం,
సుఖాలకు ఆలయం.
ఆ నిలయానికి చేరాలని అందరికీ ఆశే !
ఆ సుఖాలపై అందరికీ మోజే !!
కాని అ నిలయానికి చేరాలంటే దాటాలి ఓ పెద్దనది,
అందులో ఉన్నాయి స్వార్థపూరిత నాయకులనే మొసళ్ళు,
సంఘ విద్రోహకులనే పాములు, కులమత తత్వాలనే సుడిగుండాలు
అవినీతి, అన్యాయమనే కెరటాలు ఉప్పొంగి
ముంచివేయాలని చూస్తున్నాయ్
ఆనదిని ఈది అప్రదేశం చేరేదెపుడో ! *

# చిన్నారి పాపలు

చిరునవ్వు లొలికిస్తూ ఆడుతూ, పాడుతూ
అందాలు చిందుతూ అమాయకత్వం ప్రతిబింబిస్తూ
చిలిపిచేష్టలు చేస్తూ లోకమంటే తెలియని
ఆ బాలల్ని చూడు
చూడ ముచ్చటగా రంగురంగుల దుస్తుల్లో,
కళకళలాడే ముఖాల్తో ఉన్నవారిని చూడు.
ఆ నడిరోడ్డు మీద చిరిగిన విస్తరిని తనకంటే తనకంటూ
ఎంగిలి మెతుకులకోసం పోట్లాడుకొంటున్న ఆ పిల్లలెవరు ?
చిరిగిన బట్టల్లో
ఆకలితో
ఎముకల గూడును దాచుకొంటూ
స్నానమంటే తెలియని
తలకు నూనె లేని
బడి అంటే ఎరుగని
వేళకి తిండి లేని
ఆ పిల్ల లెవరు ?
బతుకుదెరువుకు కార్లు తుడుస్తున్న
ఆ పిల్ల లెవరు ?
పొట్ట చేతపట్టుకొని వీధివీధి తిరుగుతున్న ఆ బాల లెవరు ?
అమాయకపు పువ్వుల్లో గూడ అంతరాలకు కారకులెవరు ?




# యువభారతి
# సాహిత్య సమావేశాలు

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు
సాహిత్యం కంటె ఇతర సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో
గడచిన పదహారు సంవత్సరాలుగా కృషి చేస్తున్న
సంస్థ 'యువభారతి'. మనిషిలో అంతర్లీనంగా
ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కావడానికి
యువభారతి ప్రతీ నెలా మొదటి, మూడు
ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని
శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో
సాయంత్రం 5 నుండి 8 గంటల వరకూ సాహితీ
సమావేశాలు నిర్వహిస్తున్నది. ఈ సమా-
వేశాలకు సహృదయులందరూ ఆహ్వానితులే!

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3